శ్రీ

# బృహన్నల విజయము

కావ్యస్మృతితీర్థ :

జనమంచి శేషాద్రిశర్మగారిచే

వ్రాయఁబడినది.




రామా అండ్ కో.,

విద్యావిషయిక ప్రచారకులు,

హెడ్డాఫీసు — ఏలూరు.

[బ్రాంచెస్:—గుంటూరు - రాజమండ్రి - భీమవరం.



[వెల 0—15—0

# తొలి పలుకు

మహాశయులారా !

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥

అన్న భగవదుక్తిననుసరించి ద్వాపరయుగాంతమున నరనారాయణులు మహర్షులు కృష్ణార్జునరూపముల నవతరించి భూభార హరణమను మహాకార్య మొనరించి తన్కాలమున సాధురక్షణ ధర్మసంస్థాపనములను మహాకార్యముల నొనరించి కృతకృత్యులైరి. అందు శ్రీకృష్ణమూర్తి నాయమే ప్రధాన మనియు, నర్జునుం డుపకరణ భూతుఁడనియు మహాభారతమును బరికింపఁగా దెలును. ఈ విషయమున నాగమశాస్త్రవేత్తలొక యితిహాసమును దెలుపుదురు.

"విజయుఁడను నొక భూపతి శత్రుపరాభూతుఁడైయడవులకుం జని యందుఁదపంబొనరించి మరలశత్రువుల నడంపనుత్సుకుఁడై రామాదులం గూర్చి తపంబొనరించిన నాయవతారములు లేవుగాన భగవంతుఁడా రూపమున మాఱి దర్శనమిచ్చుటకు జాలకాలము పట్టుననియు వాయుపుత్త్రుఁడు హనుమంతుఁడెప్పుఁడున్నందునం ద్వరగా దర్శనమిచ్చుననియు దలపోసి యా మారుతింగూర్చి ఘోరతపం బొనరించెను. దానం బ్రీతుఁడై మరుదాత్మజన్ముఁడు ప్రత్యక్షమై వత్సా! వరమడుగుమని తెలిపెను. హనుమంతుని గాంచినంతనె సంతుష్టాంతరంగుఁడై యించుకసేపుండి మరలసిర్విణ్ణుఁడయ్యెను. ఏల వరమడుగక యాలసించుచున్నాఁడవని హనుమ ప్రశ్నించెను. విజయభూపాలుఁడు మరల నమస్కరించి వినుతించి,

సర్వపి స్త్రీషుబంధుత్వే విద్యాధిక్యేచ సత్యపి ।
స్వైరితాంసత్యాంచ హనుమన్ యాచ్ఞాంతా బహుమానతా॥

యని పెద్దలు పలుకుదురు. కావున నిన్నువరము వేఁడిన నీబహుమానము తగ్గునేమో యని విచారించుచున్నాఁడ నని బదులిచ్చెను. మారుతియు శంకింపక వరమడుగుమని త్వర పెట్టెను. విజయుఁడు శత్రుహస్తగత రాజ్యము మరల విజయ పూర్వకముగా లభింపవలయునని వరమడిగెను. హనుమయు వత్సా ! నీ కర్మము దృఢమూలమైనది. దానిని మార్పరాదు. భవిష్యజ్జన్మమున నీకదిలభించును. కాన నూఱడిల్లుమనియెను. రాజు నాకీ పరిభవము తొలగుటెట్లని ప్రశ్నింపగా మరున్నం దనుఁడు "భయంపడకుము. విజయుడన్న పేరు నీకుంగల్గును. నీ సంగ్రామమునుజూడ నేను నీధ్వజమున నుందును. విజయము లభించునని" యెన్నియో సమాధానములు చెప్పిపోయెను.

ఈ కథ యుక్తియుక్తముగానే యున్నది. కావున నమ్మఁ దగినదియే! అట్టి యర్జునుని విజయము నీగ్రంథము తెలుపును. దీనికి 'బృహన్నల విజయ' మని నామమిడుటకుఁ గల కారణ మును కథయే తెలుపును. కాన దానింగూర్చి పెంచి వ్రాయ నక్కరలేదు.

ఈ వత్సరము S. S. L. C. బోర్డువారు యీ గ్రంథ మును S. S. L. C. పఠనీయ గ్రంథముగా నిర్ణయించినందు లకు వారికి నా కృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నాఁడను.

ఇట్లు
విన్నవించు విద్వద్విధేయుఁడు :
జనమంచి శేషాద్రిశర్మ

శ్రీ

శ్రీ మాత్రే నమః

# బృహన్నల విజయము



శ్లో॥ కారుణ్యకర్బుర కటాక్ష నిరీక్షణేన
తారుణ్య సంవలిత శైశవ వైభవేన
ఆపుష్ణతా భువన మద్భుత విభ్రమేణ
శ్రీకృష్ణచంద్ర శిశిరీకురు లోచనంమే॥

— శ్రీకృష్ణ కర్ణామృతం

ఆర్యబాలకులారా! తెలివిని గలిగింపను, లోకవృత్తము నెఱింగింపను, కర్తవ్యమును దెలుపను భారతమును మించిన గ్రంథము వేఱొకటి గానరాదని పెద్దలందురు. ఆ మాట సత్యము. భారతము సకలవేద శాస్త్రసారము. ఇందు లేని ధర్మములు తఱుచుగానుండవు. సకలవ్యవహారములనియమము లిందుఁ గలవు. వాని నాచరించు మార్గములు, వానివలన గలుగు ఫలములు తేటతెల్లముగా నిందుండును. కావుననే భారత మైదవ వేదమని పెద్దలు వర్ణించిరి. అందు నర్జునుని చరిత్రమును జదివిన ననేకవిషయము లెఱుకపడును. పట్టు వదలక, ఫలముగలుగునో లేదోయని సంశయింపక, ధర్మమును వీడక ప్రయత్నించినచో నెట్టికార్యమునైన సాధింపవచ్చు

నన్న నీతి యీతని చరిత్రమునుండి తేలును. కావుననే ఇది మీరు పఠింపదగినది. పఠించుటమాత్రము చాలదు. పఠించిన దానిని మనమున మరల మరల స్మరించు నవకాశము గలిగి నప్పుడెల్ల నోపికమై నాచరణమున ననుపదగినంత యాచరింప దగును. తత్ఫలము గలుగక మానదు. ఇది సత్యము. మూఁటికి మూమ్మాటికి సత్యము. కావున నోపికమై పఠింపుఁడు.

బృహన్నల యను పే రర్జునున కెట్లువచ్చెనో ముందుగ దెలుపక తచ్చరిత్రను వ్రాయుట పాడిగాదు. కావున నించుక పూర్వచరిత్ర మిట వ్రాయు నవసర మేర్పడినది. కాన నిది యసంగత ప్రసంగమని భావింపరాదు. పాండవులు నియమము ప్రకారము పండ్రెండు వత్సరము లరణ్యములఁ గడుపవలసినవారు. కావున నాశ్రితులం గూడి యందందు దిరిగి తిరిగి ద్వైతవనమునకు వచ్చిరి. ధార్మికులకుఁ గలుగు కష్టములు వారిని మాత్రమే కాక సాధుజనులనెల్ల బాధించును. అద్దాన దుర్జనులకుఁ గ్రమక్రమమున హానికల్గును అనునది చక్కని నీతి. ఈ నీతి యేనాఁడును మార్పునొందదని నమ్మ వలయును. పాండవుల యిడుమలు చూడజాలక లోకమునఁ గల సాధుమతులెల్లఁ బెల్లుగ దల్లడిల్లిరి. ఈ కష్టములఁ దొలగింపుమా యని భగవంతుని బ్రార్థింపఁ బూనిరి. భగవంతుడు సత్యస్వరూపుఁ డగుట వారి ప్రార్థనములకు ఫలము వెంటనే ప్రసాదింపఁ బూనకుండెను. పాండవులు శపథము నెఱవేర్పక తప్పదని యా మహాత్ముఁ డెఱుఁగడా ? కాలమును బ్రతీక్షించుచుఁ బాండవులపైఁ గరుణఁ బూని

కంటికి రెప్పవలె రక్షకుఁడై యుండెను. పాండవులం గూర్చి పెక్కుమందియరణ్యములకువచ్చివారి నూఱడింపుచునుండిరి. సర్వభూతములు పాండవ హితమునే కోరుచుండెను.

ద్వైతవనమును జేరఁగనే యిందుందురుగదా యనియు, వీరి ననుసరించి వచ్చి పాండవులం జూడవచ్చునని యొకఁ గొందఱు తమ వసతులకుం బోయిరి. మితపరివారయుతులై పాండవులా ద్వైతకాననమున నుంచిరి. అది మహాభయంకర మైనది. క్రూరమృగము లన్నియు నందుండును. ప్రాయశః మనుష్యులు విచ్చలవిడిగా నటఁదిరుగ ననుకూలము కాదు. గుంపుగాఁగూడి వచ్చిపోవుటయే యంతకుఁ బూర్వము సాగు నాచారము. ఎందో యొకమూల మునులున్నను దఱచుగా జననివాసార్హమగు ప్రదేశ మాద్వైతవనము కాదని యంద ఱెఱుంగుదురు. ఆయడవిని వెదురుపొదలు క్రిక్కిరిసియుండుట దుష్టమృగములు తప్ప మఱియొక ప్రాణికోటి నివసింప నవకాశము లేదు. నిరంతర మావనమునఁ గ్రూరమృగ ధ్వనులు వినఁబడుచుండును. వల్మీకములు కొండలపిండునాఁ గనఁబడు చుండును. అందుండి కాలభుజంగములు బుసలు కొట్టుచుండ వాని వదనానిలము వల్మీక వివరములనుండి ధ్వజాకారముగా నెగయుచుండఁ జూచు ఖేచరులే భ్రమాన్వితులగుదురన నిఁక దక్కినవారిమాటఁ జెప్పనేటికి? ఆచక్కటినుండు మృగములు కలవలపాటొంది పాఱుచుండును. వన్యగజములు పగటిపూట నెందో యుండి సాయంకాలముననే పొదలనుండి వెడలి గుంపు లుఁగా జేరి విహారమునకై వచ్చుచుండ నెవ్వరేని జూచినట్లే

యసువుల వదలుచురుగాని బ్రతుకుట కలలోనవార్త. సింహముల నాదములు బెబ్బులుల భీకరధ్వనులు ఏమూలనుండియో వినంబడుచునే యుండుఁగాని నిశ్శబ్దముగా నుండువేళ యే ఋతువునందును లేదనుట స్వభావోక్తియేగాని యతిశయోక్తి యెంతమాత్రము గాదు. ఇవిట్టులుండ రాత్రివేళ నీలపురుఁగుల ధ్వనులు మృగములకుంగూడ నిద్రాభంగమును గల్గించుచుండును. ఇన్నియు నిటులుండ దివ్యపావన జలపూర్ణములగు నదులు లెక్కింప నలవిగాక ప్రవహించుచుండును. వర్షాకాలమని, వసంతకాలమని భేదములేక సదాజలపూర్ణములై యుండుటయే యందుఁగల గొప్పవిశేషము. అందున్న చిఱుకొండల నుండిపుట్టు నీటిబుగ్గలు విరామములేక నదులకు జలసమృద్ధిని గల్గించుచుండును. చిన్నచిన్న కాలువలిన్నియని యెన్న నయ్యనంతునికేని శక్యముకాదు. ఆకాలువల వెంట ఫలవృక్షములు వేసి పెంచినట్లుండును, ఫలములు గోయువారులేమి జలములం బడిపోవుచుండును. కావునఁ దజ్జలము నవ్యభవ్యసత్ఫలసారమనియే చెప్ప నొప్పును. కందమూలములు కుసుమములు తద్వనమునఁ గలవని చెప్పుట సరసమా! కాఁబట్టియే మహర్షులు తత్కాననాంతరమునఁ బర్వతముల చెంతనాశ్రమముల గల్పించుకొని నివసింతురు. తపోమహిమమునఁగ్రూరమృగములందుఁ జొరఁజాలకయుండు.చొచ్చినచోఁబరమసాధుజంతువులే యగు. కావున మృగములబాధ వారికి లేదనుట సహజము.

అట్టి ద్వైతవనమునఁ బాండవులు ద్రౌపదింగూడి పరిమితపరివారముతో నొక్క చోట విశాలాశ్రమములనుగల్పించు

కొని యుండిరి. సుఖముగనే కాలము చెల్లుచుండెను. ఒక్క-నాఁడు ధర్మరాజు సోదరులంగూడి తమకుఁ బాటిల్లినయిడుములం గూర్చి యాలోచించుచుఁ గ్రూరుఁడగు దుర్యోధనుని దుష్ప్రయత్నము నాపుటకు దివ్యాస్త్రబలముండినఁ గాని శక్యముకాదని చెప్పుచు దివ్యాస్త్రములఁ బడయుటెట్లు? ఎవరివలన ? అని తలపోయుచుండెను. అట్టితఱి,

క. వారల పుణ్యోదయమున
వారిజభవనిభుఁడు లోక ♦ వంద్యుఁడు వచ్చెం
బారాశర్యుఁడు ధర్మశ
రీరుఁడు కృష్ణాజినోత్త ♦ రీయుఁడు ప్రీతిన్.

ఆ మహాముని సందర్శనమెవ్వారికేని సకల శుభముల నొసఁగజాలునది. ఆ వ్యాసమహాముని రాకంగాంచి కరము హర్షించి యమనందనుం డనుజసహితుండై యెదురేగి వందనం బొనరించి విధివిహితాతిథేయ సత్కారములఁ జేసి తోడుకొని వచ్చి యుచితాసనాసీనుం జేసెను. మౌనియు నానందపరవశుండై కరములు జోడించి ప్రోలనిలుచున్న ధర్మనందన వాయునందన సురపతినంద నాశ్వినందనులంగాంచి వారిభక్తి సపర్యలకు మెచ్చుచుఁ గూరుచుండ నియోగించి కుశలం బడిగెను. కౌంతేయాగ్రజుండు తమ కుశలమును గష్టపరంపరాభిభూతముగాఁ దెలిపి మఱి మాటలాడఁజాలక యూరకుండెను. యాజ్ఞసేనియు మునికి మ్రొక్కిన దీవించి యామెకుం గల్గిన కష్టస్థితి నెఱింగినవాఁడు కాన నుచితరీతినూఱడించెను.

అంతఃఋతు మునిరాక శుభోదర్కమని నమ్మి తదాజ్ఞకై వేచి యుండిరి.

సాత్యవతేయుఁ డంత ధర్మసూను వదనంబీక్షించి యమనందనా! ఒక్క హితము చెప్ప నిటకరుదెంచితి. హితోపదేశము సన్మతులకుఁ జేయఁ జెల్లుంగాని కుమతులకుఁ జేయననువుపడదు. మీరును ధార్తరాష్ట్రులును నాకొక్కరూప కాని ధర్మపక్షము నాపక్షమని భావించుట నావిధి. ధార్తరాష్ట్రుల ద్వారా లోకమునకుఁ గీడుమూడనున్నది. దానిని వారింపనశక్యమని యెఱింగియు లోకాచారమును బాటించి కొంత చెప్పి చూచితి, కాని యమ్మాటలు వారికి హితములని తోఁపవయ్యె. అయ్యది వారి తప్పుకాదు. భగవదుద్దేశమే యట్టులున్న మనమేమి చేయవచ్చును.? భగవదిచ్ఛయే కార్యములను సాధించునని మనమూరకుండరాదు. భగవంతుఁడు సర్వసాక్షియైయుండు. కర్మము జీవులనాడించుచుండును. దానిశక్తి యెన్నదరంబుగానిది. దాని తలంపునకు మాఱొనరింపఁ జాలు వీరు లేలోకమునను లేరని నమ్ముము. కానఁబురుషకార మావశ్యకమే. ఇపుడు మీరు చేయఁదగు కార్యము కడుంగడుం గొప్పది. పెక్కుమంది జీవులు మీరణరంగమునఁ బ్రాణంబులఁదొలఁగ వేచియున్నవారు. వారిలోఁ గొందఱు దేవతలకుంగూడ నజేయులు. దేవతాంశ సంభూతియే దానికిం గారణము. ఆవిషయము ముందు మీరొకరిచే నెఱుంగఁ గలరు. ప్రకృతమనుసరించి వచించెద.

భీష్మ ద్రోణ కృపాచార్య రాధాతనూభవులు సామా న్యులని తలంపరాదు. ఒక్కొక్క రుక్కుమిగిలి యొక్కొక్క లోకంబును జయింపఁ జాలుదురు. బాహుబలమునకు దోడు దివ్యాస్త్రబలము వారికింగలదు. ఎట్టి బలశాలియు నొక్క యస్త్రమునకు ననువుల నీవలసియుండును. కావుననే వారిం గెల్వఁ దరంబుగాదంటివి. నారాకకుముందు నీవును సోదరులం గూడి యీవిషయమునే తలంచుచుంటివి. అవినామనసునకుఁ దట్టెను. ఇదియ యదనని నీహితముగోరి వచ్చితిని. వత్సా! నీయనుజులు సామాన్యులు కారుసుమా! దేవతలొక్కపెట్టున నెత్తివచ్చినను మార్కొని నిల్వఁజాలుదురు. కాని దానికిఁ దోడు దివ్యాస్త్రసంపద యుండవలయును. అది లేకున్నఁ బోర నరులనడంప దరంబుగాదని యెంతు. అట్టిదివ్యాస్త్ర సంపద చేకూరు విధానం బెఱింగింపవచ్చితి. నాయీమాటల నాదరించి నడపుము. దాన నీకు ముందు లగ్గగు.

అని పలుకు సత్యవతీ సూను వాక్కుల నాలకించి ధర్మసూనుం డానందసాగర నిమగ్నుండై మహాత్మా! తమ యానతియే మాకు శిరసావహింపఁ దగినది. మీకంటె మామేలు కోరువారెవ్వరు గలరు? నేను నాసోదరులు తమ యానతి జవదాఁటువారము కాము. మీ యుపదేశము మాకు శుభోదర్కము. ఆనతిమ్మా యని వేఁడెను. పారా శర్యుండించుక స్మిత మొనరించి, సమవర్తితనయా! అట్టి విధి నుపదేశింపఁ గదా వచ్చితి. ఒక విద్యగలదు. అది యధిక తమ యోగలబ్ధము. అది రహస్యము. అది సామాన్యవిద్య

కాను. విశేషవిద్యయని సిద్ధుఁ ద్దాని సేవింతురు. అదిఉపదేశింప బూనితి. ఆయుపదేశమునకు నీ సోదరులలోఁ బార్థుఁడేయర్హుఁడు. అతని కాజ్ఞాపింపుము. దాని నావలనం బడసి యుపాసించి సిద్ధి నవశ్యము పొందును. అని పలికి ధర్మనందనుం గూడి యర్జునుం బిలుచుకొని యొక్క యేకాంతస్థలమునకుం బోయి కూరుచుండి యుధిష్ఠిరా! యీ విద్య ప్రతిస్మృతి యని పిల్వఁబడు. దీనిశక్తి యత్యద్భుతము. అని తెల్పి విధిమంత ముగా నాప్రతిస్మృతి నుపదేశించెను. పందంపడి ధర్మజునితో నీయర్జునుఁ డీవిద్యామహత్త్వమున నధిక తపోవీర్య విభవుఁడై మహేంద్ర సమవర్తి జలపతి ధనపతులు లోనగు దేవతలను, మహాదేవుని సాక్షాత్కారంబు చేసికొనఁజాలు. వారివలన ననేక దివ్యాస్త్రంబులఁ బడయు. ఆ దివ్యాస్త్రసహాయంబున నజేయులగు గాంగేయాదులజయించు. నీకవశ్యంబ విజయంబు చేకూరు. మఱొక్కమాట చెప్పెద. వేఱుగా భావింపకుము. మీరిందుఁ జిరకాలము నివసించితిరి. దాన మహారణ్యమను ప్రఖ్యాతినందిన యీద్వైతవనము క్రమక్రమమున జనసమ్మర్దమున విరళకుసుమ ఫలభరపాదప సంతతి గలదియై మృగకులము నశింపనొప్పుకున్నయది. ఇంకను గొన్నియబ్దంబులిందు మీరుండినఁబోడగు. దాన మునులకు హాని గల్గును. అంతియ గాక మీవంటివారొక్కచోటన పెద్దకాలంబుండుటయు మేలుకాదు. దాన మహర్షులు ప్రీతినందరు. మునుల కరణ్యాములే జీవనాధారములు. అవినశించుట వారికిష్టముకాదుకదా! ఈమాట మీకుం దెలుపఁజాలక మీసౌజన్యమునకు నోడివా

యూరకున్నట్లు లేనెఱింగితిని. కావున నిట నింక మీరుండుట హితముకాదు. వేఱొండు కాననమునకుంబోయి యుండుండుఁడు. విశాలారణ్యము లెన్నియో యున్నవి. అందు మీరుండిన నిందలి శిష్టమృగములకు మేలుకలుగును. మృగజాతినశించుట యుఁ బ్రజాసంతతికి మేలుకాదు. సృష్టియందించుకంతయు నుప యుక్తము కానిది లేదని యెఱుంగుము. క్రూరమృగముల నేల భగవంతుఁడు సృజింపవలయునని కొంద ఱలసు లందురు. అది మిగులఁబొరపాటు. అవిలేనిచో జనులు నాస్తికులై నశింతురు. పాపములనేక రూపములనుండును. వాని యాకృతులే యివియని యెఱుంగవలయు. దుష్కార్యముల నిట్టియిట్టి వానినొనరించిన యిట్టియిట్టి క్రూరమృగభుజగాది రూపము లలవడునని లోకు లెఱుంగ వలయు, కర్మసిద్ధాంత మిట్టిదియే. కావుననడవులు మనుష్యుల నుద్ధరింపసమర్థములై యుండును. అందున్నయే ప్రాణిసృష్టియు నశింపఁజేయరాదు. ఆప్రాణికోటి వలన నింక ననేక రహస్య విషయము లెఱుంగవచ్చు. వానిని దెలుప నిది యదనుగాదు, కావున నిటనుండక వేరొక కాననమున నివసింపుము. ధర్మ నందనా! నీవన్నింటఁజతురుండవు. నీకింతకంటె నెక్కుడుగాఁ జెప్పవలసినది లేదు. ఇఁక నేఁబోయివచ్చెద. నాయాదేశం బర్జునుండొనరించునది. మీరును దద్విరహమునోర్చి యుండునది. అని పలికి యమ్మునివరుఁడు తనదారిఁబోయెను.

ధర్మరాజు విజయుంగూడి యాశ్రమమునకు వచ్చి కొలఁది దినములందుండి యనుచరుల కమ్మునివరు శాసనంబు

పిలిచి తమ్ములంగూడి యనుచరులు వెంటరాఁ గామ్యకంబను వనంబునకుఁబోయెను. ఆవన మద్భుతరీతి నమరియుండెను. అందనేక నదులు కలవుగాని సరస్వతీనది యందుఁ బ్రధాన స్థానము నాక్రమించినయది. ఆ నదీతీర భూభాగములు పరమ పావనములు, ఫలభూరుహ సందోహసాంద్రములు. కుసుమిత లతావితానంబులు, అందుచ్ఛాయద్రుమములు మెండుగఁగలవు. వాని నీడల విశ్రమించువారికి క్షుత్పిపాసలు బాధింపకుండునని పెద్దలందురు. ఆ సరస్వతీ పావన నదీతరంగము లాభూములు దమ శీకరములచే జల్లచేయుచుండఁగా నింక వానికిఁ గొఱంత యేమియుండును? ఆతీరముననే పాండవులు నివాస మేర్పఱచు కొనిరి. ఫలములు కందమూలములు వలసినన్ని దొరకు చుండెను. కావున భీమాదులకు నాహారసమృద్ధికిఁ గొఱంత సుంతయు లేకయుండెను. ద్వైతవనమును వదలినకొఱఁత వారిలో నెవ్వరికింగాని గోచరింపకయుండెను. అందుఁజేరిన పిదప ధర్మరాజునకించుక యుద్వేగము కలిగెను. కాన నొక్క నాఁడర్జునుని జేరఁబిలిచి వత్సా! భీష్మద్రోణప్రముఖులు త్రిలోకవిఖ్యాత బలపౌరుషులు. బ్రాహ్మణులకు వేదమువలె వారికి ధనుర్వేదము వశంగతమై యుండును. ఆధనుర్వేదము సామాన్యమని తలంపరాదు. అది దివ్యమంత్ర సంకలితము. అట్టిది వారికి సన్నిహితంబైయుండును, కావున వారు తత్సహాయమునఁ బగవారినోర్తురు. దుర్యోధనునిచేఁ బూజితులై తదిష్ట కార్యముల నొనరించువారు. కావున రణంబు పొసఁగునేని మనతో నెదిరించువారు మపై నెంత పక్షపాతముండినను,

దదారాధితులుగానఁ దత్పక్షు మవలంబించి పరాక్రమించక తప్పదు. దివ్యాస్త్రసంపత్కలితులుగాన వారల నోర్చుట కడిఁదియే. అట్టి యస్త్రసముగ్రుల ననినోర్చుపద్ధతి పారాశర్య మహాముని నాకుపదేశించెను. తదాదిష్టపథంబున మెలంగినచో మనకు విజయము చేకూరుటసత్యంబు. ఆవిద్యనావలననీవు ప్రతిగ్రహించి కవచకార్ముక ప్రాసాదపరికరకలితుఁడవై మనుష్యులకేరికేనజేయుండవై యుత్తరదిక్కున కరిగితపోయోగబలంబున మహేంద్రుని బ్రత్యక్షంబు చేసికొనుము. శతమఖుఁడా మంత్రబల సమాకృష్టుఁడైనీకుగన్పడును. మంత్రబల మనుపమానము కదా! పూర్వము వృత్రాసురుఁడు ప్రబలి దేవతలం బాఱఁదోలఁగా వారెల్ల నాతని ధాటికి వెఱచి తమ తమ దివ్యాస్త్రంబుల నింద్రునందుసమర్పించి యతనిబలవంతుంజేసిరి. ఆదివ్యాస్త్రంబులబలిమి నాతఁడావృత్రదానవునిజయించెను. ఆయస్త్రంబులుతదాదిగ నతనికడనున్నయవి. ప్రీతుఁడగు నింద్రుడవ్వాని నీకొసంగకమానడు. అంతియగాక మహేంద్రు నుపదేశంబుంగొని మహాదేవు నారాధింపుము. తదనుగ్రహంబుబడయుము. దాన సర్వవాంఛాసిద్ధియగు. ఇదియే వ్యాసమునివర్యుని యుపదేశము.

అని వివరించి చెప్పి వ్యాసునకు మ్రొక్కి నియతుడగు శతక్రతుసుతునకు నుపదేశించెను. అర్జునుఁడంతకుముందే వ్రతనియమమున బరిచ్యుతకల్మషుఁడైయుండెను. ప్రతిస్మృతి యుపదేశమున మఱింత తేజోవిరాజితుడయ్యెను. అమిత్రులీతనిచే జయింపబడుదురని ధర్మజుఁడు తలంచెను. ఆవిద్యను

బడసిన యర్జునుని తేజ మపారమై కనంబడుటయేగాక తేటి చూడ నలవిగాకయుండెను. విజయుండును జ్యేష్ఠసోదరు నను మతింబడసి విధివిహితముగా నగ్నిహోత్రము నారాధించి బ్రాహ్మణపుంగవులు స్వస్త్యయనకృత్యము నడపింపఁగా శుభాశిషంబుల ధౌమ్యాదులొసంగగా హర్షంబునఁ బయ నంబుచేసెను. ధర్మజ భీమాదులాతని విరహమునకు వగచిరి. కాని భావి శుభప్రదంబు కాఁగలదని యెట్టకేలకు సంతసించుచుఁ బార్థుని సాగనంపిరి.

అర్జునుండును గాండీవమను కోదండంబుఁ దాల్చి యక్షయ బాణతూణీరములను గైకొని సముత్తుంగ బాహుశిఖరము లొప్పారఁ గనకమయకవచమును దొడిగి పయనము చేయునపుడు వనదేవతలెల్ల నీతనికిష్టసంసిద్ధి యయ్యెడుమని దీవించిరి. ధౌమ్యాది విప్రవరులును మనోవాంఛాఫలసిద్ధి యగుఁగాక యని యాశీర్వదించిరి. అత్తఱిఁ బాంచాలి సవ్యసాచిఁ జేరంజని కన్నీరు మున్నీరుగాఁ బ్రవహింపఁగాఁ దనతొంటి పరాభవంబు స్మృతికిందగులడగ్గుత్తికతో విజయా! అనమానము నోర్వఁజాలని యీక్షత్రియవంశమున నాకిఁక జన్మము లేకుండుఁగాక! మిగులనోర్పుగల బ్రాహ్మణకులమున బుట్టువుకల్గుఁగాక! యని పలికి యించుక ధైర్యమూని ప్రయాణ కాలమున దుఃఖించుట శుభోదర్కము కాదని యూహించి సన్ననియెలుంగున,

చ. అరికృత దుష్పరాభవ మహార్ణవమగ్నుల మమ్మనందఱిం
గరుణసముద్ధరింపుము జగన్నుత! యన్న్యులుపూనఁగానియీ

భరము వహింపఁబూనిన యపారగుణాన్వితు నిన్ను దక్కఁగన్
ధరణియు సోముఁడున్ నభము ధాత్రియు గావునఁ గాచు
చుండెడున్.

అని శుభవచనములఁ బలికి, స్నేహరసవిలోలాపాంగ విలోకనంబులఁ బరిగృహీతపాథేయుఁడగు పార్థుని జేయుచు నతని యెడఁబాటు నోర్వఁజాలని హృదయంబెట్టులో కదిల పఱచుకొనియుండెను. భీమార్జునులర్జునుఁడు పోవుమార్గముననే దృష్టులం బఱపుచుఁ గొంతసేపుండి మరలి యాశ్రమంబు చేరిరి. ధర్మనందనుండు పార్థువిరహమున కీసుమంతయు ధైర్యము లేనివాఁడయ్యును వ్యాసమహర్షి వచనంబులం దలంచుకొనుచు భావిశుభము నాశించుచు నూరకుండెనుగాని యాతని మోము దమ్మి యాఁదినమంతయు విచ్ఛాయమై మహత్తర చింతను దెలుపుచుండెను.

పిదప నర్జునుఁడు పూర్వోత్తర దిశాభిముఖుఁడై కొంత దూరము పోయెను. అప్రతిస్మృతియోగ విద్యా మహత్త్వమున నేభూతములకుంగాని తేఱి చూడరాక పోయిపోయి హిమాలయమును దాఁటి దానిచెంతనుండు గంధమాదనమునుదాఁటి పోయెను. ఆవలిమార్గము మానవుల కగమ్యమే యగు. ఐనను వ్యాసదత్త యోగవిద్యయు దేవదత్త గాండీవమును దనకుఁ దోడుగాఁ దోడ్పడుచు బోయి గంధమాదనమున కవ్వల నింద్రకీలమను భూధరంబుఁ జేరి దాని నశ్రమంబున నెక్కి దానిపైఁ బోవుచుండెను. ఎందుఁ దపస్సొనరింపఁ దగునో యాతఁ డెఱుఁగడయ్యెను. ముందెందో నిలువవలయునని మార్గశ్రమము లెక్కింపక పోవుచుండగా నోవీరోత్తమా!

ఇఁకఁ బ్రయాణము సాగింపకుము. ఇందె నిలువుము. అనుమనోహరనాదము శ్రుతులం బడియెను. దానికి వెఱఁగందుచు నిలుచు నాతని శీర్షముపైఁ బూలవాన కురిసెను. దాని కత్యంత విస్మితుండై యించుక నేల నతిక్రమించి యందొకచోట నొక్క భూరి మహీరుహంబును బొడఁగాంచెను. అది యపురూపముగాఁ గనఁబడియెను. దానిం జూడఁగనే పార్థునకొక నూత్న హర్షము తోఁచెను.

ఆభూరుహ మూలమున వృద్ధ బ్రాహ్మణుఁడు కూరుచుండి యుండెను. బ్రహ్మతేజం బాతని ముఖమునుండి వెలువడి దిక్కుల వ్యాపించుచుండెను. నిరంతర యమనియమముల నతని దేహము కృశీభూతమై యుండెను. పార్థుం డతని చెంతకుం బోయి భక్తి వినయంబులు పెనఁగొన సాష్టాంగ నమస్కారం బొనరించి యందు విశ్రమించెను. ఆవృద్ధ మహీసురుం డాయర్జునుం గాంచి యిట్లు ప్రశ్నించెను: అయ్యా! ఎందుండి యిచ్చటికి వచ్చితివి? నీ తేజ మనిందితము. ధర్మనియతుఁడవుగాఁ గనఁ బడుచున్నవాఁడవు. నీవిట నివసింప నేటికి? నేను చిరకాల తపోనియమముల సిద్ధిం బొందితిని. ఇచ్చవచ్చిన ఫలంబుల నొసంగెద. పరిగ్రహింపుము. మఱొక్కమాట చెప్పెద. ఈ చోటు శాంత తపస్సుల కాస్పదము. ఇందు బాణ బాణాసన కృపాణాది భయంకర సంగర సాధనములఁ దాల్చియుండఁ జెల్లదు. నిన్నుం జూడఁ బ్రఖ్యాత క్షత్రియ కుల సంజాతుఁడవని తోఁచెడు. వీతహర్ష క్రోధులై బ్రహ్మతేజో విరాజితులగు బ్రాహ్మణులుండెడు తావిది. మహాపుణ్యనివాసము. ఇట్టి పరమపావన స్థలమున భయావహ

సాధనంబులు దాల్చి యుండవలదు. ఇందుండఁ గోరుదువేని వీని విసర్జింపుము. లేకున్నఁ జాలహాని కల్గును.' అనఁగా విని పార్థుం డించుకంతయు నాతని మాటలకు జలింపక వ్యాస వచనంబులు ధర్మనందనునానతియుఁదలంచుచు నూరకుండెను. అతని ధైర్యంబున కచ్చెరువంది శతక్రతుండు తన రూపంబు జూపి పార్థున కిట్టులు పలికెను:

వత్సా! అర్జునా! నీకిష్టములగు వరములు గోరుము. తప్పక యొసంగెద. నీధైర్యంబు పరీక్షింపగోరి యిట ముని రూపంబుఁ దాల్చితిని. చాల మెచ్చువచ్చె. నీ యభీష్టముం దెల్పుము. తప్పక నెఱవేర్చెద. అనవుడు వాసవిమహేంద్రున కత్యంతభక్తి మరల నమస్కరించి దేవా! భవత్ప్రసాదంబున దివ్యాస్త్రంబులఁ బడయుటయే నాకిష్టము. అనుటయు నిలింప పతి వత్సా! దివ్యాస్త్రముల నిచ్చుట యంత గొప్పపనియా? దేవత్వమడుగుమిచ్చెదనుపుణ్యలోకంబులంగోరుమొసంగెదను. మఱియు సర్వకామంబులు వాంఛింపుము. కరుణించెదను. అనిన అర్జునుం డిట్టులనియె: దివిజనాయకా! అవి యెల్ల నా కేటికి? పరమాస్త్రలాభమే నాకిష్టము. సపత్నులు చేసిన మహాపకారము పరిభవము దుస్సహములుగా నున్నవి. నా సోదరు లడవుల నిడుమల గుందుచున్నవారు. అట్టి వారల వంత మాన్పనుపాయము మాని యూరకపోయిన నన్ను నగరే! అనుటయు నాత్మసంభవు నీతికత్యంతము హర్షించి నాయనా! పరమాస్త్రలాభమే నీవు కోరుదువేని అది నా వలనఁ గాదగిన పని గాదు. సకలలోకేశ్వరుఁడు బ్రహ్మాది వందితపాదారవిందుఁడు కరుణాపేరథియు నగు శంకరు నారా

ధింపుము. ఆదిదేవు నా మహాదేవు నారాధించినఁగాని నీ యభీష్టంబు నెఱవేఱదు. అధిక యోగనిష్ఠ నా విరూపాక్షు నాశ్రయించిన నా శంకరుఁడు లోకపాల సహితుండై వచ్చి నీ యభిమతం బొనరింపగలండు. అని పలికి యింద్రుఁడు తదుచితమార్గంబు ఉపదేశించి యదృశ్యుండయ్యెను.

ఆవల నర్జునుండును మహేంద్రుని యోగంబు చొప్పున మరలి హిమాలయంబునకుం జనుదెంచి సకలర్తు కుసుమఫల నిబిడ వృక్షంబులఁజూడనై, విమల నిర్ఝరసలిలంబుల మదికింపు నింపుచుఁగమలకుముదకల్హార ప్రముఖజలకుసుమముల విలసిల్లు సరోవరంబుల సుఖముఁగూర్చుచు హంసమృదు నినదంబుల శ్రుతిపుటంబుల కింపుఁగూర్చుచు మనోహరమై తనరారు నొక్కతపోవనంబును గాంచెను. దానింగాంచినంతనే పార్థు చిత్తము కార్యసిద్ధి కలుగునని నమ్మెను. అందు నివసించి సమాహిత చిత్తుఁడై భగవంతుడగు పరమేశ్వరు నుద్దేశించి తపోనియతింబూనెను. ఆతరుణమున సురదుందుభినాదములు కల్పతరు ప్రసూనవృష్టియు సుంగధివాయువు నాయర్జునుని హృదయప్రమోదము నినుమడింపఁజేసెను.

ఆసమయమున నాకౌంతేయ మధ్యముండు మనోవాక్కాయకర్మనియతుండై సర్వమంగళానాయకునిఁ దనచిత్తంబున నిలిపి యెడతెగని త్రిరాత్రోపవాసంబుల నొక్కమాసంబు గడపెను. అవ్వల షడ్రాత్రోపవాసంబుల రెండవ మాసంబు జరిపెను. పక్షోపవాస నియమముల మూఁడవ మాసము సాగించెను. ఊర్ధ్వబాహుండై యేక పాదాంగుష్ఠాగ్రంబుననిలిచి వాయువాహారముగ నాల్గవమాసంబు పుచ్చెను.

ఇట్లు ఘోరతర తపంబు సేయుచున్న యా కుంతీపుత్ర మహత్త్వముం గాంచి యందలి మునివరులు విస్మయ బొంది పరమేశ్వరు పాలికిం జని యిట్లు ప్రార్థించిరి. మహాదేవా! పాండుకుమార మధ్యముఁ డతిశయబలశాలి మహాభుజుఁ డీ పర్వతవరమునఁ దపము చేయుచున్నవాఁడు. అది యపూర్వరీతిం బరగుచున్నయది. ఎవ్వారే నొనరించియున్న వార్తయు వినంబడదు. ఆ తపస్సునుండి యొకయగ్ని యుద్భవిల్లినది. అది బడబానలము మించియున్నది. దాని జ్వాలలు దూరమునుండియైనఁ జూడ శక్యముగానివి. ఆ దహనజనిత ధూమములు నీలమేఘముల వలె వనాంతరము నావరించినవి. మహాదేవా! కరుణాసింధూ! ఆతని తపోభారము సర్వభూత భయంకరము. అంతియెగాక యచ్చెరువు నించుచున్నయది. కావున మా ప్రార్థనముల నాలకించి యాతని యభిమతములఁ బ్రసాదించి లోకంబులకుఁ గల్గిన భయంబులఁ బాపవే యని ప్రార్థించిరి.

మహాదేవుఁడు భక్తజనవశంకరుఁడు కావున వారి దీనాలాపముల నాలకించెను. ఆ పలుకులయం దతిశయోక్తి యిసుమంతయు లేదని యెఱింగెను. సుస్మితము మోమునఁ జిందులాడ మునివర్యులం జూచి నియతవ్రతులారా! తదభిప్రాయంబే నెఱుంగుదు. ఆతని వాంఛితములఁ దీర్పఁదగు సదను వచ్చిన బ్రసాదించెద. మీరు కుందునొందక డెందములు నిశ్చలములు కాఁగా మీ నివాసంబులకుం బొండు. సమయము నెఱింగి తపఃఫలము నొందఁజేసెద. అని పలికి వారల సాగనంపెను. మును లా మహాదేవుని యాదరోక్తుల కలరి స్వాంతములు నిశ్చింతములు కాఁగా దమతమ నివాసముల కరిగి యీశ్వరు

చిత్తమెప్పుడు వర ప్రదానోన్ముఖముగనో యెప్పుడీతనితపస్సు విశ్రాంతినొందునో మనకెప్పు డీచింతతొలఁగునోయని యువ్విళ్ళూరుచుండిరి.

## — ♦ ఈశ్వరుఁ డర్జునుఁ బరీక్షించుట ♦ —

మునుల సాగనంపి మహాదేవుఁడింక దడవుచేయరాదని భావించి విజయుఁ బరీక్షించికాని మహత్తర దివ్యాస్త్రముల నొసంగరాదని నిశ్చయించెను. పరాక్రమసమగ్రుఁడగు నర్జునుని పరాక్రమ పరీక్షచేఁ దెలియఁబడునని యూహించి కాంచన వర్ణదేహము వెలయ మహోన్నత కార్ముకమును ధరియించి యెఱుకరాజుగా నగపడియెను. పార్వతియు నెఱుకులసాని యయ్యెను. ప్రమథవర్గ్యులందఱు నెఱుకులైరి. వారికిం గుఱుచ చేతులు భయంకర రక్తనేత్రములు నలవడియెను. పొడుగుపాటి విండ్లును, కోఱమీసములు, పలువిధములగు వలలు, ఇంకను వేఁటకనువగు నితర సాధనములు నమరియుండెను. వారిభార్య లందఱు నెఱుకుసుదతులైరి. వారినాదములు దిక్కులఁ బిక్కటిల్లెను. ఎఱుకరాజునకు ముందువెనుక, ప్రక్కలనిలిచి పయనమునకు సిద్ధముగా నుండిరి. మహాదేవుఁడాక్షణంబ మృగయా వినోదమునకుం గడంగెను. వేఁటకుం జనుతఱి మ్రోయించు వాద్యమును మ్రోఁగఁజేసిరి. ఆ ధ్వనికి నలుదెసలుమాఱుధ్వనించెను. పర్వతకందరంబులెల్ల జలించెను. ఎల్లతావులనున్న మృగములు భీతిల్లి యెందున్న వచ్చటనే దేహము సంక్షిప్తముగావించి యడఁగియుండెను. ఆపర్వతమంతయుఁ గొన్ని నిమేషములకు నిశ్శబ్దముగనుండెను.

చీమచిటుక్కుమన్నను వినఁబడునట్లు లయ్యెను. శార్దూలాది క్రూరమృగములుకూడఁ దమకేమి కీడుమూడునో యని జంకి తమసంచారమునాపి యేచట్రాతి చాటుననో, యేపొదరింటనో యేచెట్టుచాటుననో కదలకయుండెను. మదగజములుకూడ నిక దమకు బ్రదుకు మార్గము లేదని నిశ్చయించి కందరముల డాఁగియుండెను. పక్షులుగూడ మధుర ఋతములుమాని కలాయముల విలీనములై యుండెను. ఇట్టు లా సమయమున నాపర్వత రాజము నిశ్శబ్దమృగపతత్రివితతియై యుండుట యచ్చెరువును బుట్టించుచుండెను.

శంకరుఁడా యెఱుకరూపంబుననుండ వియచ్చరు లాద రంబునంగాంచి బహుభంగుల వినుతించి కరుణానిరధీ! విజయుని కభీష్టము లొసంగి లోకోపకారము, నిర్జరోపకారము చేయవే యని ప్రార్థించిరి. కుసుమ వృష్టిని గురియించిరి. అచ్చరమిన్న లాడిపాడిరి. గంధర్వులు బహుభంగులగు గేయముల నా పర మేశ్వరుని వినుతించిరి. సకలప్రాణకోటియు లోకోపకార మొన రింప నీశ్వరుం బ్రార్థించెను. భగవంతుఁడత్తఱి నుత్సాహము పొంగ భక్తమనఃపరితోషాతురంబులవిజెలంగఁ గిరాతబలంబులు తోడనడువ వడివడి నర్జును నాశ్రమంబు చెంతకు వచ్చెను. అప్పుడు భగవంతుఁడు మూఁక దానవుని బిలిచి నీవు సూకరా కృతిందాల్చి యర్జును నాశ్రమంబుఁ బ్రవేశింపుము. భయంకర ఘుర్ఘురధ్వనుల నాతని వధియింపఁబూని పోవుచుట్టి చందంబు గనంబఱుపుము. ఆతని దివ్యాస్త్రములు నిన్నిసుమంతయు బాధింపజాలవు. ఇది నా వరప్రభావము. నీ కెద్దానను భీతి యొదవదు. పొమ్ము. నేనిదే నీవెంటనవత్తు. ఆశ్రమంబుఁబ్రవే

శించి తదీయ తేజస్సునకు భయంపడకుము. కృత్యము నిర్వహింపుము. నిన్ను నా యూనతి బ్రహ్మాస్త్రములేని దేటిచూడఁజాలరని వరమిచ్చి మూకదానవుం బంపెను.

మూకదానవుఁ డాక్షణంబ భయంకర నేత్రంబులు పటుతరదేహము నొంది మహాసూకరమయ్యెను. దేవతలా చిత్రముఁగాంచి యబ్బురపడిరి. ఆమహత్తరసూకరము శంకర వరప్రభావంబునఁ జేరిచూడరాక బుసకొట్టుచు గర్జను హింసింపఁబూని యాశ్రమంబుఁ బ్రవేశించెను. ద్వారముకడ నున్న మహావృక్షముల నేకశృంగమునఁ బడఁగొట్టెను. పాద ఘట్టనముల గండశిలలఁ జూర్ణములుగా నొనరించెను. మహత్తరక్రోధమునఁ గన్నులనుండి దహన జ్వాలల వెలువరించుచుండెను. ఇట్లాసూకరము తదీయాశ్రమమును బ్రవేశించెను. విజయుఁడా పోత్రిరాజమును దూరముననుండగనే చూచెనుగాని యది మహాపర్వతభాగమగుట నట్టివి తిరుగుట సహజమే యనుకొనెను. ఆశ్రమద్వారమును జేరఁగనే యిట్టి కిటివర్యమును మున్నెన్నఁడును నేఁజూచినదియే లేదు. ఇది నన్నుం బొలియింపుతలంపున వచ్చుచున్నట్లు తోఁచెడిని. దీని దృష్టియే యూహను నాకుం దోఁపఁజేయుచున్నది. మహత్తరక్రోధావేశమున వచ్చుచున్నట్లు ప్రతి క్షణమునకును గన్పట్టుచు మదికి స్పష్టముఁ జేయుచున్నది. ఇట్టి శ్వాపదములుండుటచేతనే కాఁబోలు పారాశర్యముని ధనుర్బాణముల నేమఱకుండుమనియు నాశ్రమమున నెవ్వరికిఁ బ్రవేశమును గల్పింపకుమనియు హెచ్చరించెను. దానికిది దృష్టాంతము గానున్నది. కావున నికనిఁడలోనఁ బ్రవేశింపక

మున్న వారెవ్వరును. అలసించుట న్యాయముకాదు. వ్యాస వచనమును గొనసాగించెద. తీవ్రశరంబున దీనిరూపుమాపెద క్షణమానించినఁ గార్యము తప్పును. అతివేగమున వచ్చుటం జూచి దీనిది దురుద్దేశమని బోధపడియెను. అనియూహించి చెంతనున్న గాండీవమును జేకొని గుణంబుఁ గూర్చి యించుక మెరుగుచని బాణంబుఁ గూర్చి దానిపై నిశితశరంబుఁ ప్రయోగింప సిద్ధముగానుండెను.

అవ్వరాహంబును పాండవమధ్యమునిం గాంచి సరకు చేయక వడిఁ బ్రయోగించిన బాణంబునుబోలె రివ్వునఁ బరు గిడుచుఁ దన్నుఁ జేరవచ్చుటగాంచి విజయుండొక్కడిమార్గణ మును బ్రయోగింప నున్నతఱిసకలబలంబులుంగొలువ వచ్చు చుండిన నా మహాదేవుం డోయీ దాని నేయకుము. అది నా శరమునకు గతి కాఁగలదు. దానిం దోలుకొని వచ్చితిని. ఇదియేసమయమని యెంచితి. అది నాయది. నీకు దానిం గూల్చు నధికారములేదు. అని గట్టిగా నదలించెను. ధనంజయుం డామాటల నాదరింపక దీని నేయు నధికారము నాకు లేకుండుటయు, నీ యెఱుకురాజున కుండుటయుఁ జూడవిచిత్ర ముగనున్నయది. ఈతని మాటలకేమి. కాని దీనిపైబాణము బ్రయోగించెద ఆవల నేమిజరుగునో తెలియగలదు. నే నర్జునుఁడ నని వీడెఱుంగఁడు. కాననే యోయీ యేయకు మేయకు మని వారించుచున్నవాఁడు. ఇఁకఁ దడవుచేయరాదని తా దొడిగియున్న యిషువును దానిపైఁ బ్రయోగించెను. ఆ బాణ మతి నిశాతము. ప్రాణహరణచణము, అప్రతిహతము. కావుననే దీనిచే నిది పడఁగలదని యాకిరీటి ప్రయోగించెను.

పరమేశ్వరుఁడు దటాలునఁ దీవ్రకలంబమున దాని నాటనేసెను. ఇట్లు లొక్కసారి హరార్జునుల నిశాతసాయకము లా కిరివరముపైఁ బడియెను. అవి మహామహీధర శిఖరముపైఁ బడు మహత్తర భిదురమువలె ధ్వనించుచు, నా దంష్ట్రివర్యము తనువుపై వ్రాలెను. ఈ రెండును రెండు ప్రక్కలం దాఁకెను. ఒక్కతడవ భయంకర కాలదండముం బోని బాణద్వయము పక్షద్వయమును ఛేదింప నాకృతిమ స్తబ్ధరోమము పాలకడలియందుఁ దిరుగు మందరాద్రివలె గిరగిరఁ దిరిగెను. అప్రతిహతములగు నా శరముల తాఁకున నా వరాహతనువు నిలువఁజాలదని మూఁకదానవునకుఁ దోఁచెను. కావునఁ దనవలనఁ గావలసిన పనియైనందున నా యసురుఁడా రూపము నచ్చటనే వదలి యీశ్వరానుగ్రహంబున నదృశ్యుఁ డయ్యెను. అర్జునుం డద్భుతానందముల మునింగెను.

అత్తఱిఁ గృత్రిమకిరాతవేషముం దాల్చిన మహాదేవుఁడు మహోన్నతచాపమును ధరించి మేరుభూధరవర శిఖరము భాతిఁ గనఁబడు తనువు మెఱయ నసంఖ్యములగుకిరాత భటులు బలిసికొలువఁ బదాఱువత్సరముల ప్రాయము గల వనచరీసహస్రములు తన్ను సేవింప, ననుపమాన మహిమమున దనరారుచు, నఖండ దుర్భర తేజమునఁ గనంబడుచుఁ దన మహాత్వమేరికే నిట్టిదని తెలిసికొన ననువుపడకయుండ, మింటి నున్న వియచ్చరు లాత్మకృతింగాంచి వెరగుపడినిలువ నర్జునుం బరీక్షింప ననువగుతఱి దొరకెగదా యని నిలువఁబడెను. ధర్మరాజానుజాతుఁ డాతనిం దేరిపాఱజూచి యయ్యా! నీ వెవ్వఁడవు? మనుష్యులకే మహాపత్వరము ప్రవేశింప శక్యము

గాదు. ఇందుఁ బ్రవేశించి ప్రియకాంతా సహస్రపరివృతుఁ డవై యథేచ్ఛగాఁ జరించు చున్నవాఁడవే? ఏల? ఇంతమంది వీరభటులు గొల్వ నే యుద్దేశమున నిందు జొచ్చితివి? మృగ యావ్యవసాయమున కింత ప్రయత్నమేటికి ? నిన్నుం జూడ సర్వకృత్యముల నెఱింగినట్లు తోఁచెడిని. ఇట్టినీవు నాయేసిన మృగంబు నేయఁబాడియే. ఇది మృగయాధర్మమునకు విరుద్ధ ముకదా! అట్టి ధర్మవిరుద్ధకృత్యము నేలచేసితివి? ధర్మవిరుద్ధము చేయువారు మదీయాఖండశక్తి మత్కోదండ వినిర్గత కాండ కాండములకు గుఱిగాక మానరు. మదీయ కాండములు ధర్మ పరులను హింసింపబూనవు. నీవంటి యధర్మనిరతుల హింసిం పక విడువవు. ఇది సత్యము. ఇపుడేమి చెప్పెదవని యడుగ నా కపటకిరాతుఁడు పక్కున నవ్వి యర్జునున కిట్లు బదులు చెప్పెను.

అయ్యా ! నీమాటలు ధర్మవృష్టిని గురిపించుచున్నవి కాని నీప్రవర్తనము దాని ననుసరించునట్లు గానరాదు. సాధా రణముగా ధర్మప్రవక్తలు చాల మంది యుందురు. వారియం దొక్కఁడైన ధర్మాచరణ పరాయణుఁడుండుట సందియమే యనఁదగు. ఈ మృగము నాయేసిన శరమునఁ జచ్చెను. నా బాణము స్పృశించిన నేభూతమేని బ్రదుకుట గానము. మృత్యువు నామాటవిన్న వడంకును. దిక్పాలకులు నాయాన శిరసావహింతురు; పరాక్రమ సంపద విక్రమీగువారు నాదర్శన మున వడఁకుదురు.మృత్యువు తనకు మృత్యువుగా నను భావిం చును. కాలదండము నాబాణమును దనకుఁ గాలదండముగా భావించును. ఇట్టి నాబాణమునఁ జచ్చిన వరాహమును నీ

బాణముచేఁ జచ్చినట్లు తలంచుచు లేశశక్తిని గలదని యూహించుకొనుచు విఱ్ఱవీఁగెదవే. ఏల? అది కుజనునిస్వభావము కదా! దానినేల యిపుడాశ్రయించితివి? ఇన్నిమాట లేఁటికేల? నీకుఁ బౌరుషము గలదేని నాతోఁ బోరఁగడంగుము. లేదా "జితోస్మి" యని యనుము, బ్రతుకుదువు. మాటలగాలక్షేపము చేయఁబూనకుము. యుద్ధోన్ముఖుఁడవే యైచో నీబాహుబలసంపద నీఱుగావించెదను అని పలుకుచుఁ బాండవమధ్యమునిం దాఁకి పినాకి శరవరములఁ బఱపి నొంచెను.

ఇట్లుపినాకచాపుఁడు తన్నుమార్కొని నిశాతవిశిఖజాలముల నైవగనే ప్రతిపక్ష పౌరుష ధ్వంసకుఁడగు పృథాపుత్రుఁడు మండిపడి గాండీవము మ్రోయించి స్వకీయనామాంకితా ప్రతిమకలంబ ప్రతానముల నవిరామముగాఁ బ్రయోగింప నామహాదేవుఁడా యద్భుత శరవర్షమును మహత్తర మహీధరము తుషారవృష్టినివలె దాని మ్రింగెను. అంతియకాక యర్జునుఁడు చూడ నాబాణములు తన్నుసోఁకఁ జాలనట్లు నటించెను. విజయుఁడా యహంకరణమును జూచి తనమది నిట్లు తలపోసెను :

చ ఇతఁడు సురేంద్రుఁడొండెఁ బర ♦ మేశ్వరుఁడొండె దినేశుఁ డొండెఁగా
కతులబలప్రభావయుతుఁ ♦ డన్యుఁడుగాఁడొరుఁడైన మద్భుజా
వితతధనుర్విముక్తశర ♦ వేగముఁ బోర సహించి యిట్టుల
క్షతుఁడన మూర్ఛితుండునయి ♦ కంపముఁ బొందక యుండ నేర్చునే.

అని యూహించి యక్కటా! నాబాణంబులు మూర్ఖుని యందుఁ బ్రయుక్తంబులగు సుభాషితంబుల భంగి నిష్ఫలంబు లయ్యె. ఇవి యనన్యభేద్యములు. ప్రతిపక్ష ప్రాణాంతకములు. వీనియందుఁ దమశక్తిని జూపజాలకున్న యవి. ఇంతియగాదు. ఈయెఱుకుతేఁడు ప్రయోగించిన నారాచములు మదీయమర్మములనాటి దివ్యాస్త్రములభంగి యాతనఁ గల్పించుచున్నయవి. ఇది యీజన్మమునకుఁ గ్రొత్తపద్ధతి. కావున నితఁడింద్రోపేంద్రులలో నొక్కఁడు కావలయును. లేకున్న మహాదేవుఁడేని కావలయును. ఈపర్వతవరంబు దైవనివాసంబు నావిందు. కిరాతరూపంబున నావిర్భవించినయొక్కదివ్యపురుషుండె కాకయున్న నిట్టి విపరీతంబు పుట్టదు. అని తలపోసియు నూరకుండక తన విక్రమంబు దీపింపఁగా నశనికల్పములగు శరమ్ముల బ్రయోగించెను. అవియు వృథ యయ్యెను. మరల నేయఁబూని యక్షయతూణీరములు శూన్యశరములగుటఁ బరికించి యౌరా! ఖాండవదహనకాలమ్మున నాకాండములునోర్చి తన కుపకృతిఁ జేయుటకుబ్బి యగ్నిదేవుఁడొసఁగిన యక్షయబాణతూణీరము లిపుడు శరశూన్యమ్ములై చూపట్టుట విచిత్రముగ నున్నది. ఇదేమి చిత్రమో తెలియకయున్నది. ఐన నిప్పు డూరకుండుట పాడిగాదు. అని యూహించి గాండీవం బెత్తుకొని యెఱుకురాజు పయికిం జని దానఁ బ్రహరింపఁబూనెను. అంతలో గాండీవమాఖండపరశువుచే నపహృతంబయ్యెను. దానిచే నర్జును హృదయము క్రోధాగ్నిమయమయ్యెను. ఆ క్రోధము నాపఁ జాలక విజయుఁ డతిత్వరంబూని తనకృపాణంబున నా శంకరు శిరంబు నొప్పించెను. అదియు వృథయయ్యెను. ఇకఁ జేయునది

లేక యాఖండల తనూజుండు పౌరుషమును మూనక వృక్షము లను పాషాణములను వైచుచుఁ బోరాడెను. విజయప్రయుక్త శిలలు వృక్షములు తదంగములందాఁకి యడంగెంగాని ఖంచు కేనియు నా పరమేశ్వరు నొప్పింపఁ జాలవయ్యెను. మఱియు నుప్పొంగు క్రోధంబున నాహరుఁబట్టుకొని పెనఁగుచు ముష్టి ఘాతంబులంబీడించుచుఁ బోరాడుచుఁ బాలివోని పౌరుషంబున నుద్దండుఁడై యుండ వనచరు లాతని పౌరుషగౌరవముల నాత్మలం బొగడిరి.

తన్నుంబట్టుకొని పడవేయనుంకించు నా పార్థుని గడు వడింబట్టుకొని పీడించి యీశ్వరుఁడు హీనసత్త్వుం జేసెను. అంత నాధనంజయుఁడు మూర్ఛమునింగెను. వెంటనే ధరణి తలమునంబడి శవముభంగి నుండెను భగవంతుఁడగు శంక రుఁడు వరదుఁడు కావున నాపార్థు శౌర్యమున కచ్చెరువంది యీతఁడు పరాక్రమధనుఁడు. స్థిరభక్తుఁడు. కావున నీతనిం గృతకృత్యుని జేయుటొప్పు. తడవుసేయరాదు. నాతో బెనఁగి ధరణీతలంబునఁ బడియున్నవాఁడు. శక్తిఁ గలిగినందాఁక నిరతి శయ పౌరుషంబు మెఱయఁ బోరాడెను. భీతియనునది యాతని దేహమున నేరక్తనాళమునందును గనుపట్టదు. దివ్యాస్త్రముల నొసంగ నీతండిపుడు పాత్రుఁడు అని యెంచి కరుణాళుఁడై యక్కిరాతరూపంబు మాని జటాజూటమున శీతమయూఖ రేఖయు, హస్తమునఁ ద్రిశూలము, కంఠమున గరళచిహ్నము కటితటమున గజాజినము, ఫాలభాగమునఁ దృతీయనేత్రము, తనువున భుజంగహారములు మెఱయుచుండఁ బ్రత్యక్షమై తన దయాదృష్టి నాతని విగతమోహుం జేసెను.

విజయుఁడంత మేల్కనినట్లు లేచి నిలిచెను. మహా దేవుండాతని సాదరంబుగవీక్షించి మహేంద్రనందనా! నీవంటి పౌరుషశాలురు క్షత్రియులలో నొక్కరు నిక్కాలమునఁ గానరారు. నీ యద్భుతతపస్సునకు క్షాత్రంబునకు, నీ సద్గు ణంబులకు మెచ్చితిని. వరంబీయవచ్చితిని. నీకోర్కె సఫలం బైనట్లే భావింపుము. ఇఁక మద్దర్శనంబున ద్విగుణితబలుం డవై సదేవాసురమానుషంబైన జగంబంతయు నీవు జయింప గలవు. మదీయ స్వరూపంబుఁ జూడుమని దివ్యదృష్టి నొసం గెను. పార్థుండు తద్దివ్యరూపంబుగాంచి "కృతార్థోస్మి" యని సాష్టాంగ నమస్కారము నొనరించెను. బహుభంగుల నుతించెను. మరల నమస్కరించి చేతులుజోడించి,

క. ఎఱుకని యెఱుగక నీకుఁ
మఱకువ నెదిరితిని దీని మఱవుము నన్నుం
గఱకంఠా! క్షమియింపుము
నెఱి నెవ్వరి కెఱుగనగునె నీ చరితంబుల్

అని నిలువంబడియున్నయప్పాండవమధ్యముని గరుణా రసప్రీతి విస్తారిత విలోకనామృతంబున సంతర్పితు నొనరించి సుస్మితంబున మోము వెలయనర్జునాయని సంబోధించియతని కరంబును బట్టుకొని నీ చేసిన వ్యతిక్రమంబును క్షమించితిని. నీ పరాక్రమ మతిమానుషము. కానఁ గడుంగడు మెచ్చితిని. పార్థా! ఇట్టియతిమానుష పరాక్రమము నీకుఁగల్గుటకు హేతువు గలదు. పూర్వజన్మంబున నీవు నరుండను దేవర్షివి. నారా యణునకు సఖుండవు. నరనారాయణులను పేరునఁ బరగుమీా

నిక్కము లోక హితార్థము బదరీవనంబున ననేక సహస్ర సంవత్సరములు ఘోరతపస్సు చేసితిరి. దాని మీ వీర్య మింతయని పరిగణింపనశక్యము. అట్టియమూల్య తేజంబుల జగమ్ములు సంరక్షితంబులగు. ఈగాండీవకోదండంబు పూర్వజన్మంబునను నీయదియ. పూర్వము దేవేంద్రునకు త్రిలోక రాజ్యాభిషేకము గాకయుండ నసురు లుద్దండ పరాక్రమంబున నడ్డగింప నింద్రుండు నిన్నాశ్రయించెను. అత్తరి నీ వీ గాండీవమును జేఁబూని మహాసురులఁ జంపి చెండాడితివి. అవ్వల శక్రాభిషేకము సముచితముగఁ గొనసాగెను. ఆధనుర్వర మీ తరుణమున నక్షయ బాణతూణీరములతోడ మన్మాయాశక్తి గ్రస్తంబయ్యె. నీ గాండీవకోదండము, నక్షయ బాణతూణీరములు మరల నీకిచ్చెద. కైకొనుము. ఇంక నీ వెద్దికోఁ బూనితివో తెల్పుము. కరుణించెద. అని ప్రసాదమేదురదృష్టి నవలోకింప నర్జునుం డానందసాగర నిమగ్నుండై.

క. త్ర్యంబక ! నాకు నభీష్ట వ
రంబుఁ బ్రసాదించె దేని ♦ రౌద్రము దివ్యా
స్త్రంబనఁ బరఁగిన పాశుప
తంబుఁ బ్రసాదింపు మిందు ♦ ధర ! దయతోడన్.

మహాత్మా ! ఈయస్త్రమును బ్రహ్మశిరంబను మహాస్త్రంబును యుగాంత్యకాలంబునందుఁ బ్రయుక్తంబులై జగత్సంహారంబు చేయు. ఈదివ్యాస్త్రంబుల నుండి యనేక శత సహస్ర సంఖ్యల శూలంబులు గదలు క్రూర భుజంగంబుల వంటి బాణంబులు నుద్భవిల్లునని వింటి. నీకారుణ్యంబున

నీయస్త్రద్వయంబును బడసి దైత్యదానవ యక్షరాక్షస పిశాచోరగంబులను, వీరాగ్రేసరులగు భీష్మద్రోణ ప్రముఖులను జయింతు. మఱియు సహజ కవచకుండలుండైన కర్ణుని వధియింతు. కావున నీయస్త్రంబులను గటాక్షింపుమా యని ప్రార్థించెను.

అనిన మహాదేవుండు కరుణాతరంగితాంతరంగుఁడై యతనికి మహాస్త్రంబుల నీయదలంచి తపఃపరిపూరిత చిత్తుండై యుపదేశార్హుండైన పార్థునకు నమ్మహా మంత్రధ్యాన జప హోమ పూర్వకముగా సంధాన మోక్షణ సహితంబుగా పాశుపతాస్త్రం బొసంగెను. అర్జునుండు కృతార్థోఽస్మి యనియె. అంత నీశ్వరుండు విజయా! ఈ యస్త్ర రాజమునకు నసాధ్యమేదియును లేదు. ఇదియే నీకుంజాలును. కాని యీ మహాస్త్రంబు నల్పులయందుఁ బ్రయోగింప వలదు. అట్లు ప్రయుక్తంబె యైనచో జగంబుల సంహారంబుచేయును. దీని విధానంబిట్టిదని యింద్ర యమ వరుణ కుబేరాదు లెఱుంగరు. ఇఁక దక్కినవారికి శక్యమగునే! కావున నీకీ దివ్యాస్త్రంబు నొసంగితి. విధానం బెఱింగించితి. ఏమఱక విధి ననుష్ఠింపుము. జాగరూకుండవై యతివీరుని యందును, అతి దుస్తర కార్యమందు నుపయోగింపుము. మఱియు నీ యస్త్ర రాజమున నీవఖిలలోకమ్ములు జయింతువు, సంశయింపకుము. అని దీవించి పురాంతకుం డంతర్ధానమ్ము నొందెను. మహర్షులకు మున్నున్నభయము వాసెను.

భగవంతుఁ డంతర్ధానము నందినంతనే యర్జునుఁడా

పాశుపతాస్త్రరాజమును గరమ్మున ధరియించెను. అది సూర్యకోటు లుదయించి ట్లు ప్రజ్వలించెను. దానిం గాంచి దితిజ దనుజ యక్ష రాక్షసవరులు మిగుల భీతిల్లిరి. అది యమోఘ సాయక మగుట యంద తెఱుంగుదురు. భూదేవియు జలనిధి పర్వతసంక్షితో భీతిల్లి గిరగిరఁ దిరిగెను. అర్జునుఁడు తన దేహము త్రినేత్ర దేహస్పర్శనమునఁ బావనమై సకలపాపరహితమై తనరార నతిశయ తేజోవీర్యము లొప్పారఁగా మహానందము నొందెను. అత్తఱి నాయర్జునుఁడు,

క. మంటి హరు దేహమంటం
గంటి నుమాధీశు నసుర ♦ కంటకహరు ము
క్కంటిఁ గఱకంఠుఁ జూడఁ
గంటిఁ గృతార్థుఁడనైతిఁ ♦ గడుఁ బుణ్యమునన్.

అనితలపోసెను. మఱియును దన మనమ్మునమాయన్న యగుయుధిష్ఠిరునకు సకలశత్రుల జయించుభాగ్యము గల్గెను. సర్వజన సమ్మతుఁడగు నాయుర్వీరమణుఁ డీయస్త్ర ప్రభావమ్మున సకలరాజ్య మేలంగల్గును. సర్వప్రయోజనంబులు సమకూరెను. అని తలపోయుచుఁ దన తపోనియతి ఫలించెగదా యని పరితృప్తిం బొందుచు మరలి తనసోదరుల చెంతకుం బోవనూహించుచుండెను.

—♦ ఇంద్రుఁ డర్జునుం జూడవచ్చుట ♦—

అంతట దనకుమారుఁ డర్జునుఁడు శ్రీమహాదేవు ననుగ్రహమునకుఁ బాత్రుఁడగుటయుఁ, దాన దివ్యాస్త్రలాభము నందుటయు నెఱింగెను. ఆయస్త్రప్రభావమ్మున నాతఁడు తనకు

మహోపకారము చేయఁగలఁడని యూహించెను. వెంటనే ధర్మ వరుణ కుబేరులంగూడి సిద్ధగణము తనుం గొలువ దివ్యవిమానారూఢుఁడై యా హిమాలయమున కరుదెంచెను. విజయుఁ డస్వర్థనాముఁడై నిజసోదర దర్శన కుతూహలుఁడై యుండఁగా వారెల్ల నతనింగాంచిరి. అత్తరి ధర్మరా జానరుం గని ప్రమోదంబున నిట్టులు పలికెను: ధర్మనిత్యా! ఓ పాండు పుత్రా! నీతపోనిరతికిమెచ్చి నీకింద్రాదులువరంబులిచ్చు వేడుక వచ్చిరి. వీరలం గనుంగొనుమని దివ్యదృష్టిని ప్రసాదించుచు నర్జునా! నీవు నరుండను నామంబునఁ ప్రఖ్యాతినందిన దేవర్షివి. బ్రహ్మనియోగమున మనుజలోకంబున మహోత్తమ క్షత్రియకులమ్మున జన్మించితివి. సూర్యవంశంబునఁ గర్ణుఁడు పుట్టియున్నవాఁడు. దానవాద్యంశములఁబెక్కుమంది భూపతులుప్పటిల్లి యున్నవారు. వారెల్లనీచేఁబడువారు నీకీర్తి భూలోకమున నక్షయముగ నుండఁగలదు. అని పలికి ప్రీతిపూర్వకముగ నరాతి నిరాసార్థమై యప్రతివారణంబగుదండంబును బ్రసాదించెను. వరుణుండును సంప్రీతుఁడై ఘోరారివీర పరాక్రమనివారణసారంబులగు వారుణపాశముల నొసంగి యాశీర్వదించెను. శత్రువుల దీనంజెందుమా యని కౌబేరాస్త్రమును కుబేరుఁ డనుగ్రహించెను.

అర్జునుఁ డిట్లు దివ్యదృష్టిగలుగుటకతన దేవరూపముల ధరించియున్న వారిని బితృదేవతలంగూడి యున్నవారిని దన ముందట నున్నవారిని దిక్పాలురంగాంచెను. అందు మహానీల వర్ణుండై వైవస్వతుం డగపడియె. వైడూర్యమణిచ్ఛాయ నలరుచు సాగరశైవలిపరిసేవితుండై వరుణదేవుండు దృష్టి

గోచరులయ్యె. తప్తచామీకరచ్ఛాయలనొప్పారుచు యక్ష రాక్షసులు గొలువఁ గుబేరుండు గానఁబడియె. వారివలన దివ్యాస్త్రంబులును లభించెను. విజయుండత్తఱిఁ బరమానంద భరితుండై వాగ్రూపపుష్ప ఫలంబులఁ బాదోదకంబుల వారి నెల్ల సంతృప్తులనుగాఁ జేసెను. ఐరావణాధిరూఢుండై సుపర్వ సముదయపరియుతుండై త్రిలోకనాయకుండై వజ్రహస్తుండై వృత్రసూదనుండై యలరారు మహేంద్రుండు పొడసూపెను. ఆతనింగాంచి యాదిమమునియగు నరుండు ప్రమోదభరము నొందెను. అత్తరుణమునందు,

ఉ. ఇందుధర ప్రసాదమున ♦ నిష్టవరంబులుగాంచి సద్గుణా
నంద విధాయియైన నిజ ♦ నందను, దండితశత్రు సద్గుణా
నందితుఁజూచి వేడ్క-నయ ♦ నంబులు వేయును గన్నతత్ఫలం
బందెఁ బురందరుండు పర ♦ మాద్భుతసమ్మదమందితాత్ముఁడై.

ఇంచుకతడవు మాటరామి నూరకుండి పదంపడి విజయుంగాంచి వత్సా! నీవు మహాదేవుని దపంబున నలరించి దివ్యాస్త్రములం బడసితివి. దాన దేవత్వముగూడ లభించెను. కావున దేవకార్యంబు నిర్వహింపవలంతివైతివి. నాస్యందనంబును బంపెదను. అమరావతికి రమ్ము. నే నీయఁదగు దివ్యాస్త్రంబుల నందే యిచ్చెద. నేఁటనుండ వీలుకాదు. బృందారకులం గూడి పోయెద. నాయరదంబు రాఁగా దానిపయిం గూరుచుండి వేగంబ రమ్ము. అని పలికి యతని గౌఁగిటం జేర్చి దిక్పాలకాదిసంయుతుండై సురపురంబునకుం బోయెను.

నరుండా మహేంద్రస్యందనంబెత్తఱి వచ్చునోయని వేచి

యుండెను. కొలఁది ముహూర్తములకే వ్యోమమార్గమున మహావైభవంబునఁ దనరుస్యందనంబు కనఁబడియెను. మహానీల వైజయంతీ విభవము గననయ్యెను. వివిధరత్నప్రభల నా యరదంబు వెలుఁగుచుండెను. దిగంతముల తత్కాంతులు నితాంతము ప్రకాశింపఁజేయుచుండెను. దాని నేమిరవములకు మహీధరదరీముఖములు ప్రతిధ్వను లిచ్చుచుండెను. నానాయుధములం దొప్పుచుండెను. మహాశని విద్యుత్సహస్రాభిశోభిజలద సంకాశమై యది చూడంజూడ మహానందమునుగూర్చుచుండెను. మహత్తర జవనాశ్వములు వేయి దానిని వహించి యీడ్చుచుండెను. అట్టి మహోన్నత స్యందనం బర్జునుని ముందు దిగి నిలిచెను.

ఇంద్రసారథియగు మాతలి యర్జునుం జూచి సర్వసుపర్వదానవ ముకుటతటసంఘటిత రత్నప్రభా భాసురపదుండై త్రిలోకపరిపాలనాదరుండై మహత్తర వైరి నిషూదనుండగు శతమఖుండు నీ జనకుండు, భవదాగమనం బపేక్షించి నిన్నమరావతికిం దోడ్కొనిరా నన్నుంబనిచె. పాండుతనయా! రాజసూయాశ్వమేధాది మహాక్రతువులనేకములొనర్చినవారికైనను రథంబియ్యదియారోహింపదుర్లభంబు. దీనినెక్కరమ్మనిన నర్జునుండును గంగాస్నాన పవిత్రీకృతగాత్రుండు గావున నప్పుడు రథం బెక్కఁబూని దేవఋషి పితృతర్పణంబుల నొనరించి స్వర్గగమనార్హతంబొంది మాతలి ప్రహితంబగు నాదివ్యస్యందనంబు నెక్కెను.

అత్తఱి నాయర్జునుండు మందరాచలమందున్న వాఁడు

కావున నాయద్రిని భక్తిమెయిం గాంచి చేతులు జోడించి మందరాచలవర్యా ! నీవు నిరంతరాయత తపస్సమాధి నియతాత్ములకు నికేతనమ్ము. బహుపుణ్యాలోక కాంక్షులకుఁ గల్పవృక్షమవు నీవే. విశుద్ధమనస్కులకుఁ గామధేనువవు నీవే. నీ రత్నమయకందరములయం దనేక నిలింప దంపతులు విహారములు సల్పుచుందురు. అట్టి నీ కిదె నమస్కారములు. నేను కొంతకాలము నీయందు నివసించి పుణ్యతీర్థములు సేవించుచు గంగా జల ధౌత విమలస్థలరుహ వనస్పతిఫలంబుల నుపయోగించుచు సుఖంబుంటిని. ఇప్పు డమరావతికి మహేంద్రు నానతిం బోవలయు. నిన్నిదె వీడుచున్నవాఁడ. పోయి రా ననుజ్ఞయే. అని సాశ్రునేత్రుఁడును గద్గదకంఠుండునై మందర నగంబు వీడ్కొని పురందరనందనుండు దేవపథంబునరిగెను.

అరిగి యరిగి మందాకినీరంగత్తురంగ తరంగమాలికా డోలికలనూఁగు సువర్ణపద్మములం గాంచి యౌరా యని మెచ్చుచుఁ దచ్ఛీకరముల మునింగి పొలయు సమీరములకు హాయి నొందుచుఁ గమలషండమండితకలరవ మనోహర కలహంస మిథునముల విలాసములకు మెచ్చుచు మాతలినేర్పునకు నహో యనుచుఁ గతిపయక్షణంబులకె స్వర్గనగరమును జేరెను. అది సుఖాకరము. దుఃఖవార్తాదూరము. సకలరత్నరత్నాకరము. దివిషత్సైన్య గంభీరము. దానివంటి దదియే యని చెప్పుటయే కవులకు మర్యాదగాని యింకొక్కదానితో సాటి యని చెప్పుట యించుకలోపమే. ఆనగరతల్లజమున నొక్కచో నిరుపమపరమధర్మమార్గమునఁ బ్రజలం గాపాడి వారికొరకై పరరాజవీరుల మార్కొని వెనుకంజపెట్టక మరణించిన వీర

రాజకుమారచూడామణు లలరారుచుండిరి. వేఱొక్క వీథిని రణరంగమున బరరాజవీరభటుల మాఱొడ్డి ప్రాణములర్పించుకయు నాసక్తిఁబూనక పోరాడుచుఁ దమ పౌరుషము ప్రభువులు గాంచి నుతింపఁ బ్రాణములు విడిచిన శూరభటు లుల్లసిల్లుచుండిరి. మఱియొక భాగమున విధివిహిత సకల యజ్ఞముల నొనరించి దివిషత్పుంగవులను, భూదివిషద్వరులను దృప్తి నొందించి యాగఫలంబులఁ బరమేశ్వరున కర్పించిన ధర్మాత్ములు హాయిగా నుండిరి. వేరొక్క తావున నిరంత రోపవాసము లొనరించి శరీరము కృశింపఁ దపంబు సల్పి పరమేశ్వరు నలరించిన తాపసులు విశ్రమించి యుండిరి. ఇంక నొక్క ప్రక్కనఁ బతిహిత ప్రవర్తనమున వన్నెఁ గాంచి పతిని బరమాత్మునిగాఁదలంచి పరిపూత చిత్తలై భర్తృ సమారాధనము భగవదారాధనమని తలంచి యట్లొనర్చి సకలలోక విఖ్యాతికై చెన్నుమీఱు సాధ్వీమణులు పతులం గూర్చి స్మితపూర్వకముగ సంభాషించుచుండిరి. మరొక్క చక్కి మతముల దూషింపక పరమేశ్వరు సర్వాంతర్యామిగా జింతించి నామభేదములచే నతని వేఱుచేసి యుత్తమ మధ్య మాధమ కల్పనలచే నుతించి యీసడించి నిందించి ఘోర పాపముల సంపాదించుకొనక భక్తి పరవశులగు సమబుద్ధు లుల్లాసమున దైవమును వేఱుభంగుల నుతించుచుండిరి.

మఱియు నిట్టి పుణ్యాత్ము లెందఱో ఆయాయి తావుల నలరారు చుండిరి. ఇంత పరిమాణమని తెలుప నెఱుంగ శక్యముగాని యెత్తుగల పార్శ్వములు, సౌధములు, ప్రాసాద ములు నిండియుండ నానగరంబు తనకుఁ దానే సాటియని

యుండఱికిఁ దెల్పుచుండెను. త్రిలోక సామ్రాజ్యమున కదియే కదా నెలవు! సూర్యచంద్రుల దీప్తులట తేజస్సును స్వదీప్తిచే నాపురము నిరంతరము పగలే యుండుండునని చెప్పఁదగి యుండెను. ఆ దీప్తికి నాద్యంతములు లేవు. హెచ్చు తగ్గులు లేవు. ఒక్క విధముగా వెలుఁగుచుండును. ఆహితాగ్నులు గానివారికిని, అతీర్థసేవకులకు, అనృతవాదులకు, వేదవిరుద్ధాచార పరాయణులకు, సంగర పరాఙ్ముఖులకుఁ బ్రవేశింపరాక యా సురపురంబు పరఁగుచుండును. పాపాత్ములు దానిం జేఱి చూడఁజాలరు. పుణ్యాత్ములకది సుగమమై సంతోషదాయకమైయుండును. అట్టియమరావతి నర్జునుండు కన్నులలర గాంచెను. పోయిపోయి గోపుర సమీపమున నొక్క మదగజమును గాంచెను. దానికి దంతములు నాలుగు. కటితటములనుండి సదా మదజలము స్రవించుచుండునుగాని యెవ్వరినది బాధింపకుండునట. దానిం జూడ హిమాలయమా యను భ్రాంతిని మేను కంపించును. దానిపే రైరావతము. దానిం జూచు కోర్కె నెందఱో పుణ్యపురుషు లందుండిరి. దాని స్పృశించువారును, నమస్కరించు వారును, బూజించు వారును, వినుతించువారును నై యందఱట వేడుకమైనుండిరి. దానిం గన్నులారఁజూచి యర్జునుండు కేలుమోడ్చెను. తండ్రి వాహనమును గౌరవమును దనమదిచేఁ జూపెను. మాతలి యతని మనోభావమెఱింగి యితఁడు సామాన్యుఁడు కాఁడని తలంచెను.

మఱికొంతదవ్వు నగరమునఁ జనఁగా నర్జును రాక నెఱుంగుదురు గాన సురసిద్ధ విద్యాధరులు, కిన్నర కింపు

రుష చారణులు విజయుని బొగడిరి. మహత్తర వినుతులనతని సంతుష్టాంతరంగునిగాఁ జేసిరి. వారి సందడిఁ దగుభంగి బహుమానించుచు నర్జునుండు జనకు ప్రాసాదంబు చెంతకుంబోవుచుండఁగా సకలర్తు కుసుమ సౌరభ సుకుమారోద్యానము తరువరములఁ గేళి సల్పిసల్పి ప్రణయోత్సుకుఁడై పవమానుఁ డాతని నెదురుకొని గౌరవించి కౌఁగలించుకొనియె. ఆసుఖమపారము. దానికి సరియగునేయని చెప్పకతప్పదు. అత్తఱి దేవతలందఱు మర్త్యలోకమునుండి మహానుభావుఁడు దేవకార్య నిర్వహణ దక్షదీక్షుఁ డరుదెంచెనని వేడుకపడి చూడవచ్చిరి. అందు గొందఱు ఈ వచ్చెడు మహాత్ముఁ డాదిమునియగు నరుఁడని చూచిరి. కొందఱు హరిహయ వర తనయుఁడని యాదృతిం గాంచిరి. మఱికొందఱీ మహనీయుఁడు హరిత్పతి పర్యాసహాయుఁడని దర్శించిరి. ఇంకనుం గొందఱీ పుణ్యపురుషుఁడు శంకరు మెప్పించి సకలాస్త్రములను వరములను బడసెనని త్వరపడి కనుఁగొనిరి. ఇట్లు మహాదరంబునఁ దన్నుంజూచి యానందించు దివిషల్లోకముగాంచి యంచితరీతి వారి నానందింపం జేయుచు నచ్చరమిన్నలు తన్నెదుర్కొని మంగళగీతంబులు పాడుచుండ నాలకించి ముదమందుచు సిద్ధమునివర్యులాశీర్వదింప శిరస్సొగ్గి పరిగ్రహించుచుఁ దండ్రిమందిరంబుకడ మాతలి పనుపున నా దివ్యరథమునుండి యవతరణము చేసెను.

మందగమనంబున రథంబుదిగి యభ్యంతర మందిరంబున కరిగి యందు ననుపమ సింహాసనాసీనుండై త్రిభువనావన రతశీలుండై సకలదేవ మానివర సమన్వితుండై యభేద్య వజ్రవిజృంభిత హస్తుఁడగుచు త్రిదశ సముదయ పరియుతుండై

యలరారు శతమఖునిం గాంచి శిరము పదపంకజములసోఁకఁ బ్రణమిల్లెను. దివిషద్రాయం డమందానంద మానసుఁడై భుజశిఖ ములుప్పొంగఁ దనయునెత్తి కౌఁగిటం జేర్చుకొనియెను తొడపై నిడుకొనియెను. పదపడి నిజాసనార్ధభాగమున నుపవిష్టుం జేసెను. అంతతో సంతృప్తినొందక బలుమారులా కొమరునిం గనుచుఁ దనబాహువుల నాతనియంగమును స్పృశించుచు మితి లేని సమ్మదమునందుచుండెను. అప్పుడప్పుడు త్రిదశవిలాసినీ మణులు కరకంకణ రవంబులు వింతసంతసంబుగూర్పఁ దదీయ కరకలిత చామీకర దండమండిత చారు చామరజనితమంద మందాలోల కుంతలసంతానుఁడై యమరపతిఁగూడి మహా సనార్ధంబున వసించెను. పాకశాసన శాసనంబున బృందారక బృందము లారాధించెను. పిదప నర్జునునకు దివ్యమందిరం బొక్కండు నిర్దేశింపఁబడియె. అందుండి మహానందము ననుభ వించుచుండెను.

సాయంసమయము కాఁగా జంద్రుఁ డుదయించెను. అతని సేవింప నచ్చర మిన్నలెందఱో నియోగింపఁబడిరి. గంధర్వు లానందమును గల్గించు గానముచేయ నాజ్ఞప్తులైరి. వారెల్ల పాకశాసనుం బోలె నాతని సేవించుచుండిరి. అత్తఱి నింద్రుని పంపున సేవార్థము నిర్దేశింపఁబడిన యూర్వశియను నప్సరస కాంతామణి యర్జును నాకృతివిశేషముల నెందఱో వర్ణింపనాలకించి యాతనిసాంగత్యమును గోరి దివ్యతరాలంకారముల దనువును గైచేసికొని పురందరనందను మందిరము చేర వచ్చెను.

నరుం డా నారీమణిఁ దిలకించి తండ్రి సంబంధమున నామెపై నతిశయగౌరవము గలవాఁడై భయము, భక్తియు గలిసికొని వెలయ సంభ్రమంబునఁ బ్రత్యుత్థానం బొనరించి దండప్రణామంబు లాచరించి కరయుగమును జేర్చి యిట్లు పలికెను: తల్లీ! నన్నుఁ బుత్రస్నేహమున మనస్సున మన్నించి సకలశుభముల నొసంగవచ్చితివి. నీపుత్రప్రేమమునను సంతోషించెద. నీరాకచేఁ గృతార్థజన్ముఁడ నైతిని. అనిపలుకు నర్జును మృదువాక్యము లా లలనామణి చెవులకు ములుకులవలెఁ దోఁచెను. తమకము మతిస్థిరతను జెల్లాచెదరు చేసెను. ధర్మనిపుణుఁడగు నర్జునుఁ తోనంత నాలేమ మెల్లన నిట్లనియె:

తే. నీకు నేనాఁటితల్లిని ♦ నిజము చెప్పుమ
యమరలోకంబువేశ్యల ♦ కైన మాకు
నిట్టి తగవులు నడవవ ♦ హీనబాహు
వీర్య! యిచ్చటవావియే ♦ వెదకఁజనునె. ?

పార్థా! మనుజ లోకంబునం గల యాచారంబుల నెఱుంగుదువు. వానితో నిచ్చటి యిలవాటులఁ బోల్చుచున్నవాఁడవు. వినుము వచించెద. ఇది సురలోకము. ఇందీయాచారము మునిజన సమ్మానితము. ఇట్టియాచారము తప్పనియుఁ బాపము గలుగఁజేయునదనియు నెవ్వరును దలంచరు. మర్త్యలోకనివాసుఁడవుగాన నచ్చటియాచారమే నాకింపుగా నుండునని యందువు కాబోలు. విజయా! నీవిచ్చటికి వచ్చితివికదా! ఏ దేశమున నున్నప్పు డచ్చటి పెద్దలాచరించు నాచారమునే పాటించవలయునని పెద్దలందురు. నివు నీవిషయమును వినియే

యుందువని తలంచెదను. ఎప్పుడు నీ వీ దేవలోకమునకు వచ్చితివో అప్పుడే దివ్యపురుషుఁడవైతివి. కావున నిచ్చటి యాచారములనే పాటించనలసిన వాఁడవు. అట్లగుట నామనో రథంబు సఫలంబుచేయుము. అని యేమేమో చెప్పుచుండెను.

ఊర్వశి పలుకులా యర్జునుని శ్రుతులకు విశిఖప్రతతుల వలె బాధాకరములై వినంబడెను. ఐనను నిర్వికారధైర్య ధుర్యుఁడై యప్పాండుతనయ మధ్యముఁ డల్లన నిట్లు బదులు పలికెను. అక్కటా! ఇట్లుపలుకఁ జనునే! ఇది ధర్మద్రోహము కాదా! దీన మహాదోషము కలుగ కుండునా! హరిహరీ! నీమన సున నిది న్యాయము, ఇది యన్యాయము నను నూహలు కలుగలేదా! ఇట్లు నన్నుఁగూర్చి పలుకుట యుక్తమా! జన యిత్రీ! దేవతల యాచారములఁ బాటింపుమంటివి. దేవతలు లోకంబులను బుట్టింపను, రక్షింపను, సంహరింపను సమర్థులగు దురు. వారెట్లు నడచిన నెగ్గు చేకూరదు. భూలోకము కర్మ భూమి యనంబడు. అందు జన్మించిన వాఁడను. కర్మఠుఁడను. అట్టినాకు నిచ్చటి యాచారములు పాటించు టుచితముగాదు. మదీయవంశకర్తయగు పురూరవునకు నీవు పత్నివి. నాతండ్రి యగు మహేంద్రునకు బరిచర్య చేయుదానవు. ఈ కారణము లచే నాకు జననివి. దీనికి సందియమ్ములేదు. తల్లీ! నన్నుం బుత్రవాత్సల్యమునం బరికింపుము. ఊరక దురాచారముల నలవాటు చేయఁ బ్రయత్నింపకుము. అది నీకును నాకును మేలు గూర్చు నట్టిదికాదు. కాన నీప్రయత్నము మానినఁ జాలమేలు. అని పలికి యూరకుండెను.

## —♦ ఊర్వశి యర్జునుని శపించుట ♦ —

ఊర్వశి తన ప్రయత్నము భిన్నమగుటకుఁ దన మనోభీష్టము నెఱవేఱనందులకుఁ గరంబు కుపితురాలయ్యెను. దాననామె నయనంబు లరుణవర్ణములయ్యెను. దేహముకంపించెను. అత్తఱి నెదుట నిర్వికారచిత్తుండై యున్న యర్జునుం జూచుకుఁ జూపులం జూచెను. తన మాట లెక్కసెట్టక మీఁదు మిక్కిలి నీతుల నుపదేశించు చున్నవాఁడే యని యూహించి దాన లజ్జనొంది దాని నడఁప గ్రోధముం బూనెను. అర్జునా! నా ప్రార్థనము నంగీకరింపక పోతివి. అంతతో నుండక నాకు నీతి నేర్పు పద్ధతి నగపఱచుచు నాక్షేపించితివి; దేవతల భూషించునట్లు నటించుచు నిందించితివి. తుదకు దేవలోక మనాచార భూయిష్ఠ మనుట నీ భావమని తోపింపజేసితివి. ఔరా! నీ మనోగర్వము! ఇట్టి నిన్ను శాపానలమున గృశింపఁజేయకుండఁజాలకున్నదాన. కావునశాపంబొసంగెదను. మానినీమణినగు నా కోర్కె ఫలింపకుండఁ జేసితివి కావున నీవు మర్త్యలోకంబునందే మానవర్జితుఁడవై మానినులనడుమ పేడివై యుండుము. ఇదియె నీ కీ యపరాధమునకుఁ బ్రాయశ్చిత్తమని శాపం బిచ్చి యా యూర్వశి దిగ్గన లేచి తన గృహమునకుం బోయెను. అంతట ప్రభాత సమయంబయ్యెను. సురపతి యెట్లో ఆ వృత్తాంతంబెల్ల విని కొడుకు చెంతకుం బోయి యిట్లనియె: వత్సా! నీవంటి ధీరు నెందును గానను. ముందుండినట్లును వినలేదు. మహర్షులు గూడ నీ యింద్రియ నిగ్రహమును గొనియాడఁ గలరు. నాకు బరమానంద మొనఁగూర్చితివి. ఈ యూర్వశి యిచ్చిన శాపమునకుఁ

జంత్రిల్లగము. అది యనుభవింపక విడువ నయితిగాదు. అది సత్యముగా నీకు మేలుచేకూర్ప భగవత్ప్రయత్నమున నేకల్గినది. ఏమందువా వినుము. మీ రజ్ఞాతవాసము నొక్క సంవత్సరము గడుపవలయును. గదా! ఆవత్సరమున మీ రితరులకు గపడకుండ నుండు నుపాయ మాలోచింపవలయును. అత్తఱి నీకీశాపము మహోపకార మొనరించును. కావున నీవాయజ్ఞాతవాస వత్సరము షండరూపమునను౦డి రాజకన్యకలకు నృత్యంబు నేర్పుము. ఆ దుస్తర వత్సరాంతమున శాపమోక్షంబు పడయుము. ఆశాపమా పండ్రెండు మాసములుండి చనును. ఇది నాచేసిన మర్యాద. నీవీ శాపమును సంతసంబున గ్రహింపుము. ఊర్వశీరూపమున నీయదృష్టదేవత నీకీ యుపకార మొనరించెనని నేనెంతును. అని యాదేశించి యర్జునుని నీయతికి మెచ్చి తన యింటికిం బోయెను. పిదపం గొలంది దినములకు మరల విజయు చెంతకు వచ్చి వజ్రాస్త్ర ప్రభృతిదివ్యాస్త్రముల నుపదేశించి వాని ప్రయోగములు నుపసంహారములు క్రమముగాఁ దెలిపెను. వానికి రహస్యముల నెఱింగించి యెత్తఱి నట్టి మహాస్త్రములనుపయోగింపవలయునో తెలిపెను. ఎట్టి దారుణసంగ్రామములు వొసంగినను నీ వజేయుండవగుదువని యాశీర్వదించెను. ఇట్లు సౌహార్దమున నర్జునునకు వరంబులిచ్చి చిత్రసేనుఁడను గంధర్వపతియొద్ద గీతవాద్యనృత్యంబులు నేర్చుకొన ననుమతిచేయ నాగంధర్వపుంగవుండు గారవమున నన్నియు నేర్పెను.

ఇట్లర్జునుం డందుండి కలాకౌశలంబుల నేర్చుచుండ నాకాల మిట మర్త్యలోకంబున నైదువత్సరములుగా గణింప

బడియె. ఒక్కనాఁడు రోమశమహర్షి యింద్రునిదర్శింపవచ్చి సకల సురగణ పూజితుండై మహేంద్రుంగూడి యేకాసనం బునఁ గూరుచున్న యర్జునుంజూచి యచ్చెరువంది శతమఖున కిట్లులనియె. ఎన్నియో నియమముల నాశ్రయించి యనేక యుగములు తపస్సులొనరించినవారికింగూడ నగమ్యముగదా యీమహాసభ! అట్టి యీసభంజేరు పుణ్యంబునకంటె నీ దయకుఁ బాత్రుండగుట మహాపుణ్యము. అట్టి యీమహాసభ యందు నీతోడ నేకాసనంబున నీయపర స్వరూపముగానలరు చున్న యీమహాపురుషుండెవఁడో, ఏలోక మీతనిఁ నివాస మునఁ బరిపూతమో యెఱుంగఁ గోరుచున్నవాఁడ నని ప్రశ్నించిన రోమశమహర్షికి దేవేంద్రుఁడిట్లులుబదులుచెప్పెను. మునీంద్రా! నీవెఱుంగని యర్థంబులుగలవే. నానోట వినగో రితివి వచించెద. ఈతఁడు నరుఁడను మహాముని. మనుష్య లోకమున నుదయించెను.మదంశమునఁ గుంతీగర్భమున జన్మించిన భాసుర తేజుఁడు. శ్రీకృష్ణ ప్రియమిత్రుఁడని యెఱుంగుము. ఈతనితపోవిభూతికిమెచ్చి మహాదేవుఁడుపాశుప తాస్త్రవరమనుగ్రహించెను. నేనును దివ్యాస్త్రములనేకముల ననుగ్రహించితి. ఈదివిజముఖ్యులు ననేకాస్త్రములదయచేసిరి మహత్తర దేవకార్యమొక్కఁడు నిర్వహింపఁబూని యిందున్న వాఁడు. ఇంకొక్కమాటవినుము. పూర్వముసగరపుత్రులుసము ద్రమును దవ్విరిగదా! అట్టిమహాబలులనెల్లం దన తీవ్రదృగ్ద హనజ్వాలల భస్మముగా నొనరించిన కపిలమహర్షియే నారా యణుండయ్యెను. అట్టి యీనరనారాయణులు జగన్మహోప కారులు. భూభారనిర్వాపణ కారణులు.దైత్యదానవ క్రూర

మహీరమణావధార్థంబు మర్త్యలోకంబునఁ బుట్టినవారు. కావున దేవతలకు మహోపకారమొనరించియజేయులై పాతాళమున నున్న కూరిరనివాత కవచదానవాధముల నీ మహావీరుఁడు వధియించును. అని యతని ప్రభావంబు చెప్పెను. వెండియు మునీంద్రా! నీవారు మర్త్యలోకంబునకుం బోయి ధర్మరాజుం గని యతనికిం దదనుజులకును సంతోషముగా నిందు బార్థుండు సుఖంబున్నవాఁడని యెఱింగించి భీష్మ ద్రోణ కర్ణాదిమహావీరుల నోర్చునట్టి దివ్యాస్త్రంబులం బడసి వేగంబ రాఁగలండనియు వగవకుండుఁడనియుఁ దెలుపవలెను. మఱియునావచనంబునధర్మరాజునఖిలతీర్థసేవ సేయం బనుపుము. అట్లైనతండఖిలపాతకవినిర్ముక్తుఁడగును. సకలమహీరాజ్యంబు వడయఁగలఁడు. అతఁడు తీర్థయాత్రచేయుతఱి నీవాయనకు బాసటగానుండవలయు. ఇది నాకభిమతకార్యంబుగావున దీని మానక చేయందగునన నామునియు సంతోషమున నంగీకరించెను. అంత నింద్రునిచేననుజ్ఞాతుఁడై రోమశముని మర్త్యలోకంబునకుం బోయెను.

## —♦ అర్జునుండు ధర్మజునొద్దకు వచ్చుట ♦—

అర్జునుండిట్లు మహేంద్రాదులవలన నమోఘ దివ్యాస్త్రంబులఁ బడసి వానినుపాసించుచు నందెయుండెను. ఇటఁ బాండవులు రోమశునివలన నర్జును కుశలవార్తల నెఱింగి తదాదిష్ట మార్గంబునఁ దీర్థంబుల సేవించుచుఁ దుహినగిరి ప్రాంతమునసుండిరి. అత్తఱినంబరమునుండి నలుదిక్కులం బ్రకాశింప జేయుచు నొక్కరథంబుదిగి వచ్చుచుండెను. అచ్చెరువందుచు

నందఱు దానిం జూచుచుండిరి. కొంతతడవునకు సారథి గోచరించెను. మఱికొంతసేపటికి దానియం దర్జునుఁ డున్నట్లు తోఁచెను. ఆతని తనుద్యుతు లనుపమానములుగా నుండెను. అంతలో రథంబునుండి యవతరించి నరుం డతిభక్తివినయ సంభ్రమముల ధర్మరాజభీమసేనులకు వందనములాచరించెను. నకుల సహదేవులు వచ్చి నమస్కరింప వారలం గౌఁగిలించుకొని ద్రౌపదీ మనస్సారసంబును బ్రఫుల్లంబుగా నొనరించుచుండెను. ధర్మజుఁడు మాతలి నతిప్రీతిం బూజించిన నతండా దివ్యరథంబుం గొని దివంబునకుం బోయెను. అర్జునుండు సోదరులకు మహానందముం గూర్చు స్వప్రయత్నమును దెల్పి పరమేశ్వరుండు తన్నుఁ బరీక్షించిన విధం బెఱింగించి యింద్రలోకంబునఁ దనకుఁ గల్గిన శాపంబును శతమఖుండు దానిని మార్చిన ప్రకారంబు నెఱింగించి యాదినంబుఁ గడపెను.

## —♦ ఇంద్రుఁడు పాండవులకడ కరుదెంచుట ♦—

మఱునాఁడు పౌర్వాహ్ణిక కృత్యంబులు నిర్వర్తించి ధర్మతనయుండు తమ్ములంగూడి సుఖోపవిష్టుండై యుండ నత్యద్భుత దేవదుందుభి నాదములు వినబడియెను. మఱొక క్షణమునకుఁ గిన్నర గంధర్వగీత నినదములు వినవచ్చెను. తరువాత నచ్చరల కంఠరవములు వారి పాటయు శ్రుతిపుటములఁ బ్రవేశించెను. అంతలో విమానములు గనబడియెను. అప్పుడే యవి చేరువకు రాఁగా నందుండి యమర సముదయముం గూడి యమరనాథుఁడు దిగి పాండవులఁ గానవచ్చెను. ధర్మనందనుఁ డనుజన్ములం గూడి విధివిహిత సమర్చనల వారల సంతుష్టు

ములు, బహువిధమైన కూర్మ గ్రాహనివహంబులు శైలముల వలెఁ గన్పడుచుండెను. దానిం జూచినంతనే యద్భుతముం గాంచినట్లు నామది తద్దయుంబొంగెను. అందు గొంతదవ్వరిగితిమి. ఒక్క నగరము దృగ్గోచరంబయ్యెను. ఆపురవరమాసముద్రోదరంబున నలరారుచుండెను. విశాలాట్టాలకములు, ప్రతోళికా ప్రతానములు, విచిత్రపతాకావళులు బహువిధప్రాకారములు గలిగి యా పురీశిల్పజము నేత్రపర్వముగా నుండెను.

దాని ద్వారంబున రథంబు మాతలి నిలిపెను. నేను దేవదత్తంబుపూరించితిని. ఆధ్వని దశదిక్కులనిండి భయమును గల్గింపఁజాలియుండెను. నాకే యచ్చెరువుగానుండెను. మహో మహీధర గుహాంతరములనుండి ప్రతిధ్వనులు వీతెంచుచునే యుండెను. దాని విని యందలి దానవులు నానావిధాయుధ సంపన్నులగు వీరభటులంగూడి యనికి వెడలివచ్చిరి. వారి తనుచ్ఛాయలు గాఢాంధకారమును గల్గింపఁ జాలియుండెను. వారు చూచుటకే భీతిని గల్గించుచుందురు. ఆచోటు స్వభావముగాఁ జీకటిలో నున్నట్లుండెను. దానికిందోడు వారి దేహచ్ఛాయలు గాఢాంధకారమును బుట్టించునవి. ఇఁకఁ జెప్పవలసినదేమి? అట్లు గాఢాంధకార పర్వతములో యన నరుగుదెంచి నారథమును జుట్టు ముట్టి నిలిచిరి. వెంటనే నాపయి మహాస్త్ర వర్షము కురిసెను. నాకపుడాగ్రహముదయించి యొడలు తెలియక యుండెను. వెంటనేయుద్దండగాండీవమును మ్రోయించి యొక్కొక్కనికిఁ బెక్కమ్ములం గప్పి చిక్కుపడంజేసితి. అంత వారొక్కుమ్మడి నారథగమనము సాగకుండ నావరించి బాణమ్ముల నారథంబును గప్ప నారథంబు గానరామికి మునులు

దేవతలు చింతిల్లిరంట. మాతలియుఁ జేడ్పడి రథము నడపఁ జాలకుండెను. నేనాతని భీతిమాన్పి రథచోదకుండను గూడ నైతిని. నిశాతవిశిఖ పరంపరల వారి బెగడుపడం జేసితిని. ఆకృత్యమునకు సంతోషించి మాతలి నన్నుం బొగడుచు రథము నెట్లో గడుపుచు నాకృత్యమునకుఁ దోడ్పాటు చూపెను. అత్తఱినా గాండీవనిర్గత ప్రచండకాండంబులా యసురుల మేనులు జొచ్చి రక్తధారలు వెడలునట్లు చేసెను. సంగర రంగమెల్ల రుధిర ప్రవాహసమాప్లుత మయ్యెను.

అంతట దానవులు మాయా యుద్ధము చేయఁబూని వారుణాస్త్రంబులు ప్రయోగించిరి. వానిచే నఖండవృష్టి గురియ నారంభించెను. దానిం జెరల్ప నేన తఱి మహేంద్రదుం డొసంగిన శోషణాస్త్రంబును ప్రయోగించి దానిని నివారించితి. వారంతట నాపైఁ బాషాణవృష్టిఁ గురియఁజేసిరి. కులిశాస్త్రం బున దాని నడంచితి. వారంత నూరకపోక యనిలాస్త్రమును నైచి మహావాయువుతో నగ్నికణములు పడఁజేసిరి. సలిలాస్త్ర మున దాని బాధ కలుగకయుండ జేసితిని. వారుగ్రకోపులై తిమిరాస్త్రమును ప్రయోగించి నన్నుం బొలఁదోలఁ జూచిరి. దానఁ దిమిరమెల్ల యొడలం గప్పెను. మాతలిచేతినుండి ప్రతోదము నేలంబడియెను. హయరత్నము లెందుబోవను దోఁపక తిరుగాడఁజొచ్చెను. మాతలి నన్నుం గనంగజాలక యింద్రనందనా! యెచ్చున్నవాఁడవని హెచ్చరించెను. మఱియు మున్నమృతము విషయమై దేవాసురులకు మహాసంగ్రామము చెల్లెను. అది యింత భయంకరము కాదు. వీర లవార్యపౌరు షులు, దుర్దాంతులు కాన నీసంగర మతిభీతిప్రదము. ఇది ప్రళ

యమును గల్గించునట్లున్నదే అఁవిని మాతలి! యించుక సైరింపుమా. నాబాహుశక్తిం జూడుమని యతని నోదార్చి శ్రీ సూర్యభగవంతుని స్మరించి వజ్రవరంబుఁ బడసిన సూర్య బాణము ప్రయోగించి యాతిమిరము నడంచి దేవతాప్రమదంబు చేకూర్పఁగల్గితిని. గాన దానవులు భీతిల్లిరి. మాతలి యుబ్బి యార్చెను.

అంతట నే నుద్దండ కోపంబున గాండీవమునఁ గ్రూర నారాచంబులం గూర్చి వడివడిఁ బ్రయోగించితి. ఒక్కొక్క యమ్మున నొక్కఁడుగా నాదనుజు లవనిం ద్రెళ్ళిరి. వేయేల? చాపచుట్టుగా నేలఁబడిరి. శవములపిండు కొండలపిండునాఁ గనఁబడుచుండెను. క్షణమాత్రమున నొక్కండేని నాకన్నులకుం గానరాక మడిసిరి. వెంటనే యాపురమునుండి దనుజ కాంతల యాక్రందనధ్వనులు పెల్లెగసెను. పిదప మాతలి నాకాపురవరంబు గనఁబఱచెను. దాని సౌందర్యంబుగాంచి యచ్చెరువంది మాతలీ! యిట్టి నగరతల్లజంబున సుఖంబుండక శతమఖుండేల సురపురి నున్నవాఁడని యడిగితి. మాతలియు విజయా! మీతండ్రి మహేంద్రుఁడీ నగరంబున రాక్షసులవలన భయము గలిగినపుడుండ నిర్మించెను. జలధిలో నుండుట నితరుల వలన భయంబులేదని శతమఖు నాశయము. అంతలో నీ రాక్షసులు బ్రహ్మవరమున బలవంతులై యీపురంబు నాక్రమింప నమరులు సంగర మొనరించి వరము కలిమి వారినోడింపఁజాలకపోయిరి. ఆవిధమెఱింగి మీతండ్రి యమరులచే వీరుచావకుండ వరమును బడసిరని తద్యాథార్థ్యమే నిన్నుఁ బనిచె. అట్టివారికి నీవోర్చితివి. దేవకార్యము చక్కఁగ

నిర్వహించితివి. అని పలికి నాకా నగర మహాత్త్వముం దెలిపి రథంబు మరలించెను. మార్గమున నొక్క తపోవనంబును నగరంబును నాకుం గనంబడియె. ఇవెవ్వరివని యడిగితి. మాతలి యింద్రతనయా! పులోమయుం గాలకయు ననువిరువురు రాక్షసాంగనలు గలరు. వారిరువురు బ్రహ్మను గురించి దివ్యసహస్ర వర్షములు తపమొనరించిరి. బ్రహ్మయు వారిం గరుణించి యరి దుస్సాధ్యంబగు నీపురంబును, నమరులచే నవధ్యులగు తనయులను వారికొసంగెను. ఇది హిరణ్యపుర మనంబడు. ఇందు పౌలోమ కాలకేయులను నసురులుందురు. వా రమరులచే నవధ్యులని తెలిపెను.

ఆమాటలు విని నేనీ పురంబుపై మన యరదంబుఁ బఱపుమంటిని. మాతలియు సప్తమారుతరయంబున రథంబును బఱపెను. ఆ నగరము రథము చేరఁగనే వారెఱిఁగి యరువది వేలరథములతో నగరముల వెల్వడి శతముఖుండను నూహాతో మహత్తర క్రోధమున నన్ను మార్కొనిరి. నేను వారి రథగమనము కుంటుపడ ననేక బాణంబులం బ్రయోగింప వాని వలనవృక్షములు పాషాణములు గవిసి రథగతుల నాపెను. వారావిధమెఱింగి తమ నగరంబుతో మాయాబలంబున నంబరమున కెగసిరి. వారి నతిప్రచండ బాణంబుల పైకెగకుండ నిరోధించి యెందుమార్గణంబుల వీరు చావరని యూహించి యొక్కింత తడవునకు సమాహిత చిత్తుండనై:

చ. ఉరగఫణాగ్ర రత్నకిరణోల్లసదుగ్రభుజు౯ వృషాంకు శం
కరు శశిఖండమండితశిఖండుశివు౯ హృదయాంబుజంబునం

దిరముగ నిల్చి పాశుపత దివ్యశరంబుచేఁ బోసి యేసితిన్
సురరిపుకోటి మీఁదవ రిసూతుఁడు మాతలి మెచ్చి చూడఁగన్.

ధర్మనందనా! ఆ మహనీయ శాస్త్రప్రభావం బేమని వర్ణింతును! దానినుండి సకల విధ క్రూరజంతువులు యక్షరాక్షసులుద్భవిల్లి యొక్కుమ్మడి వారినెల్ల బొలియించిరి. వారి మాయయు నశించె. ఒక్కఁడేని మిగులకయుండ వారు పొలిసిరి. ఆ కార్యంబున కానందించి మాతలి యరదంబు సురపురంబునకుం దోలి యింద్రున కవ్విధంబుఁ దెలుప శతమఖుం డానంద భరాక్రాంతస్వాంతుఁడై నన్నుంజూచి నవ్వుచు,

చ. సురలకు భీతిచేసితి వ ♦ సుంధర కేగుము నిన్ను నీ సహో
దరులు నిరంతరంబును ము ♦ దంబున జూడఁగఁ గోరు
చున్నవా
రరిమదభేది నీకు విష ♦ మాజిముఖంబున మార్కొనంగ నో
పరు నరు లెవ్వరున్ హరిని ♦ భంబులు మార్కొనునయ్య
యెయ్యెడన్.

విజయా! నుఁ డొక్క మాట వినుము. భీష్మ, ద్రోణ ద్రౌణి కృప కర్ణాదులు నీ బాణనిహతి కోర్వఁజాలక చేష్టుడుదురు. నిన్ను మార్కొనువారుండరని యాశీర్వదించెను. అంత సమ్మాననీయ చరిత్రుని సహస్రనేత్రుని బ్రార్థించి తదనుజ్ఞ వడసి మీచెంతకరుదెంచితిని. ఇది నాయుద్ధచరిత్రమని యర్జును డూరకుండెను. ధర్మరాజాదు లానందపరవశమానసులైరి. ధర్మ తనయుఁ డర్జునా! దివ్యాస్త్ర ప్రభావంబింతకు మాకుం గనఁ బఱస్రమాయని పలుక నరుండా క్షణంబ వాని చిత్రచరిత్రంబు

తెల్లమగునట్లుకనంబఱచి సోదరుల నానంద నిమగ్నులం గావించెను. ఆదివ్యాస్త్ర ప్రయోగమునకు భీతిల్లి వసుంధర తిరుగసాగెను. ఇంద్రుడది యెఱింగి నారదుని బాండవుల కడకుం బంప నమ్మౌని వచ్చి యథార్థ పూజలంది విజయా! శత్రువులు లేంతటి నీదివ్యాస్త్రంబులు ప్రయోగింప జనునా! పగవారు లేకున్న నివి ముల్లోకంబుల హరించుజుమీ? అని హితముపదేశించి సురమునివరుం డరిగెను.

ఆవల ధర్మసూను ప్రభృతులా వనమునందే పదిమాసములు సుఖంబుండిరి. ఒక్కనాం డాకస్మికముగా నమరకన్యలా వచ్చుచు కరుదెంచి యర్జునుంజూచి పాండవమధ్యమా! మీరు పూనిన యీ యరణ్యవాస వ్రతంబు పంద్రెండు వత్సరంబులును, అజ్ఞాతచర్య నొక్కయేటను గడపి శత్రుసంహారము గావింతురు. నీ పరాక్రమమున సకల రాజ్యభారమును మీయన్న యుధిష్ఠిరుండు తాల్చును. రఘుకులమండనుండగు శ్రీరామచంద్రుని కీర్తివలె నీ యశస్సు నిర్మలమై వెలుంగ గలదని యాదేశించి తమలోకంబునకుం బోయిరి.

## —♦ దుర్యోధనాదులు ఘోషయాత్రకుం బోవుట ♦—

ఇట్లు పాండవు లడవులలో నిడుములు గుడుచుచుండంగా హస్తినాపురమునం గౌరవులు మహాసంతోషముననుండిరి. కాని ధృతరాష్ట్రుం డపుడపుడు పాండు పుత్రులం దలంచుకొని వందురుచుండువాండు. ఒక్కనాం డాతండు ధర్మజాదులం దలంచుకొని విశేషముగా దుఃఖించెను. ఆ దుఃఖమును దుర్యోధనుండు విని యా మాటలయందు భీమాదుల

పరాక్రమములఁ దెలుపు మాట లుండుటంబట్టి తండ్రి భీతుఁడయ్యెనని యూహించి మామ యగు శకునితో నేల మా తండ్రి యింత భీతుఁడయ్యెనో యని యాతనిం దోడుకొని కర్ణునిం బిలువం బంచి యతండు రాఁగా నొక్క వివిక్త ప్రదేశంబునకుం బోయెను. కార్యాలోచనంబునకుం గడంగుఁడు కర్ణుఁడిట్లనియె: మహారాజా! పౌరుషముగల పాండుపుత్రులు వనములపాలైరి. ధర్మనందను కునికిపట్టగు నింద్రప్రస్థ నగర లక్ష్మి నిన్నే వరించెను. ప్రాగ్దక్షిణ పశ్చిమోత్తర దిక్కులం గల రాజన్యు లందఱు నీ పాదాక్రాంతులైరి. సకల వసుంధర నిన్నుఁ బతిగా వరించెను. జనసామాన్యమునకు నీవే రాజరాజ వన్న విశ్వాసము కలిగినది.

పాండవు లిత్తఱి ద్వైతవనంబున పరమ దుఃఖార్తులై దిక్కు లేకయున్నట్లు తెలియవచ్చెడిని. వారి నెవ్వగ మఱింత వర్ధిల్లునట్లు మహావైభవంబున నీ వా వనంబునకుం జని నీ తేజము నగపఱుపుము. దాన వారికిఁ బెల్లువగ యుప్పతిల్లు. సంపద యనఁగా మిత్రజన మోదము, శత్రుజన ఖేదముగదా. మఱియొక్కమాట :

ఉ. నారలుగట్టి కూర లశ • నంబుగ నుగ్రవనంబులో విప
ద్భారమునొంది వందురిన • ఫల్గును నుజ్జ్వలరాజ్యవైభవో
దారులమైకనుంగొనుము • దంబునుబొందఁగఁగాంచుకంటెనిం
పారఁగనొందుగల్గునె • కృతార్థతయొందును గౌరవేశ్వరా!

ఇంతియగాదు, నీ దేవులయొప్పుఁ జూచి పాండవపత్ని ద్రౌపది వగగుందవలదా! తన దురదృష్టమును దలంచుకొని

చింతింపవలదా ! అనినంతనే రారాజు కర్ణా ! యిది బాగున్నది. ఈ యూహ పాటింపఁదగినదే. అని యించుకసేపూరకుండి మెల్లనయిట్లనియె. రాధేయా ! ఈయూహనాకీవరకే గలిగెను. దానినే నీవుసమర్థించితివి. ద్వైతవనమునకరుగుటమేలు. కాని రాజంగీకరించునో లేదో, ఆ ద్వైతవనమునఁ బాండవులుండుట రాజునకుం దెలిసియేయున్నది. కావున మనమట కరుగుటవారి తోడి సంగరమునకేయని యెఱింగి నివారించును. అదియుఁ గాక మహత్తర విక్రమాఢ్యులనియు మహనీయ తపోవిశేష సుస్థిరులనియుఁ బాండవులం దలంచుకొనిభీతిల్లి యింతకుముందే దుఃఖించెను. విదురుండు అప్పుడప్పుడు చెంతఁజేరి వారి పరితాపములు పొగడి భయపెట్టుచుండును. విదురుఁడు పాండవ పక్షపాతిగదా, కాబట్టి యీకార్యంబు నెట్లు సాధింపవలయునో యీ రేయి మీరెల్లంగూడి యాలోచించి యొఱులెఱుంగకుండ రేపకడ నెట్లో భీష్ముని రాజు నొడంబఱచి పోవుదమని వారింబంపి తానభ్యంతర మందిరమునకుం బోయి యారేయి సుఖనిద్రఁ గడపెను.

మఱునాఁ డుదయముననే కర్ణుండు రారాజు గానం బోయి మెల్లగా,

ఉ. భూతలనాథ యేనొకటి ♦ పోలనుపాయముఁ గంటినిప్పుడా
ద్వైతవనంబునందు విని ♦ తంబుగ నున్నవిగోకదంబముల్
ప్రీతిఁగఁ దద్విలోకనము ♦ పేరఁజనందగు ధారుణీశ్వరుం
డీతెఱఁగైనఁబొమ్మనున ♦ భీష్టముచేకుఱు నెల్లభంగులన్.

అను పలుకులాలించి శకుని దేవా ! నాకు నీ యూ

హాయే రాత్రి స్ఫురించినది. నీయాన, ఇందసత్యము లేదు. ఆమాటల కూరడిల్లి రారాజు వారలంగలిసికొని యొక గోపాలకుని బిలుచుకొని వానికటఁ జెప్పదగినమాటలు చెప్పి ధృతరాష్ట్రుపాలికిం బోయిరి. కొంతసే పుచితాలాపములు చేసి పదంపడి దుర్యోధనుండు మెల్లన నిట్లనియె: దేవా! ద్వైతవనంబునుండి యీగోపాలకుం డరుదెంచె ననుటయు వాని కభిముఖుండై రాజు గోవుల కుశలం బారయుచు, వాఁ డిట్లయె.

ఉ. ద్వైతవనంబునట్టి సుఖ ♦ వాసము గోవులకెందులేదు ధా
త్రీతలనాథ యిప్పుడు ప్ర ♦ దీప్తములై సతతంబుఁ జేర్చి గో
వ్రాతభయంకరంబులగు ♦ వాలుమృగంబులు సంచరించుమీ
కా తెఱఁగెల్ల జెప్పుటకు ♦ నై యిటవచ్చితి నేనుజెచ్చెరన్.

అను మాటలు విని కర్ణసౌబలులు దేవా యట్టి మృగకులంబుఁ బొలియింప మీకుమారుం బూన్పుట లెస్సయనిరి. ధృతరాష్ట్రుండించుక యాలోచించి మీరన్న మాట బాగున్నది గోసంరక్షణము చేయుపొంటె దుష్టమృగసంహారముసముచిత కార్యమే. కాని యవ్వనంబున గరిష్ఠాత్ములగు పాండునందనులు కలరు. కావున మీగమనము నామదికి బ్రియంబుగాఁ దోపకున్నయది. వనమునకుఁ బోయి మీరు వారిఁ దప్పక చెనకఁదలంతురు. వారు తపస్సిద్ధినందిన వారు ప్రతాపనిధులు కాన మిము దహింపఁజాలుదురు. ఇంతియకాక వారు మీచే మున్ను కష్టముఁ బొందినవారు. మీరూపములు కనఁబడఁగనే యాగ్రహించి పైఁబడకుందురా? భీముఁడూరకుండునా? అస్త్ర

విద్యామహితుండు కాకముందే యొక్కరుఁడే భూమినంతయు నోర్చినవాఁడుకదా విజయుఁడు! వాఁడిప్పు డింద్రునివలన సకలాస్త్రములం బడసెనఁట. అట్టివానికి నెదురునిలువ నెవరి కేని శక్యమగునా! కాఁబట్టిఘోషరక్షణమునకు వలయువారిం బంపుదమని యొడంబడకుండ శకుని మెల్లన నిట్టులనియె: రాజేంద్రా! పాండవుల పరాక్రమంబు మేమెఱుంగమా? వారి నేల మార్కొందుము? ఒకవేళ మేమేయపకారముచేసిన సకల నీతిశాస్త్ర పారంగతుండగు ధర్మరాజేల పాడిదప్పును? మాకును మనంబుల మృగయాకౌతుక మతిశయిల్లినది. గో రక్షణకార్యమునకుఁబోవ మాకేలాటి కీడును గలుగదు. అనిన నాంబికేయుండెంతో కష్టముమీఁద నంగీకరించుచుబుద్ధిమంతు లరై తడయకరండని యుత్తరువిచ్చెను.

ఆయుత్తరక్షణముననే ఘోషయాత్రను జాటంబంచి యాంబికేయతనయుండుపరిహృష్టాంతరంగుఁడై సురుచిరవిభూష ణంబులంబాల్చి కర్ణసౌబలులు వెంటరా సోదరులరుదేర నిజ సోదరపత్నులర్వయానంబుల నెక్కి రాఁగా మృగయులు పెక్కువేలు నడువఁ జతురంగబలంబు లుచితరీతి నరుదేరగా బయలువెడలి యుచితప్రయాణంబుల ద్వైతవనంబుం జొచ్చి యందుఁ గొంతదూరము పోయిపోయి గోకదంబంబులుండు తావునుఁజేరి యందొక్కచో శిబిరంబు కల్పితంబగుడు నందుఁ బ్రవేశించి మహాప్రమదంబున.

సీ. నానాసహస్రసం • ఖ్యానంబులై సంత
తానంద విగత భ • యత్వలీల

నక్కొనవమున నే ♦ దిక్కు జూచిన నతి
సంకులంబుగఁ గుంద ♦ శంఖచంద్ర
హార నీహారడిం ♦ డీర షటీర ము
క్తాహార హీర సం ♦ కాశములును
గాదంబకాలేయ ♦ కాదంబినీ నీల
జాలతమాలికా ♦ సన్నిభములు

తే. ప్రౌఢబంధూకపల్లవ ♦ భాసితములు
వికచకాంచన చంపక ♦ విస్ఫుటములు
నైన వర్ణంబులొప్ప ♦ నేత్రాభిరామ
భంగి నలరారు గోకదం ♦ బములఁ గనియె.

ఇట్లు చూచి వాని లక్షణంబులు గోపాలకులచే విని, యానందించుచు, వాని యభివృద్ధికి మిగుల మెచ్చుచు, వత్సంబులు,వత్సతరంబులు,మహోక్షణంబులు,ధేనువులు,తర్ణకంబులు లోనగు విశేషముల నాలోకించుచు, వానికిందగిన రక్షణంబు గావింపఁదగు. వారి నియోగించి గోపాలురం గూడి యాయా భాగములందిరుగుచుక్షీరపానమున ముదమందుచు మిత్రులం గూడి యందలి వినోదంబులు చూచి పరమానందసాగరమున నోలలాడుచు వందిమాగధుల యాలాపంబుల నానంద మందుచు గాయకనర్తకాదులు దర్శింపరా వారిని సన్మానించుచు మృగయావినోదంబులకుందగిలి మృగయులు నలుగడల బలసి కొలువ దుర్గమభాగంబుంజొచ్చెను.

అందు మహోత్కంఠతఁ గోదండంబున నారిఁగూర్చి యంతకంత కుప్పొంగు పౌరుషంబున.

మ. హరిణవ్రాతములం గలంచుచును దగ్రానేకపశ్రేణిఁ జె
చ్చెర బంధించుచు నుగ్రసింహనివహచ్ఛేద్రైకసంక్రీడబం
ధురతంజేర్చుచుఁ బ్రస్ఫురన్మహిషశార్దూలోద్ధతక్రోడని
ర్భరపాతంబులొనర్చుచుండిరి గభూపశ్రేష్ఠుఁడ కాననలోన్.

అంతట మానక ననవరతము సుగంధబంధుర సరసీరుహప్రకరప్రకీర్ణంబులగు జలాశయంబులఁ జూచి వానిందవిలి వచ్చు శీతలమారుతడింభకముల కచ్చెరువందుచు మనంబున కింపును బెంచు మృదుమధుర ఫలభరితానోకహంబులఁజూచి శిరఃకంపము సేయుచుఁ బుష్పవాటికల నడుమ విహరించుచు మయూర మధుకరశుకపికాలాప కోలాహలంబులకుఁజెవి యొగ్గుచు మెల్లమెల్లనఁ బాండవులుండు వనంబునంతికంబున కరిగెను.

ఆచెంతనొక్క రమ్యప్రదేశంబున ధర్మనందనుండనుచర పరిజనసమన్వితుండై మునిసముదయ సహాయంబు గలిగి ఫలములు, మూలములు సాధనంబులుగా సద్యస్కందంబను పేరుగల యొక యజ్ఞము చేయుచుండెను. ఆవార్త ధార్తరాష్ట్రుని శ్రుతివివరములఁజొచ్చెను. ఆసమీపముననే యొక సరోవరముగలదు. దాని శీతలసలిలంబులకు దేవతలచ్చెరువందుదురు. దేవకన్యక లపుడపుడు వచ్చి యందు స్నానమొనరించి పోవుటయు గలదు. ఆ సరోవరమునకు జెంతనే ధర్మరాజు యాగము చేయుచుండెను. దుర్యోధనుఁడా కొలను చేరువ క్రీడార్థము పట కుటీరముల నిర్మింపుఁడని భృత్యుల కాజ్ఞనొసంగెను. సేవకు లప్పుడే యాకొలను

డరిం గ్రీడామందిరంబు ను నిర్మింప సమకట్టసాగిరి. అంతకు ముందే చిత్రసేనుండను గంధర్వరాజు దేవపతి నియోగంబున దుర్యోధను నవమానింప నాయత్తుండై యుండెను. కావున నాతని పరిచరు లరుదెంచి దుర్యోధను భృత్యుల వారించి యియ్యది మా ప్రభువు చిత్రసేనుండను గంధర్వరాజునకుఁ గ్రీడార్థంబు కల్పితంబయ్యెను. వీని దరిన నుండ ననుమతి పొందవలయు. దూరముగాఁ దొలగిపొండు. క్షణమైన నిందుం డకుండని గట్టిగాఁ బల్కిరి. వారు చేయునది లేక దుర్యోధను పాలికిం జని యా వృత్తాంతమును దెల్పిరి. దుర్యోధనుండు యుక్తాయుక్త వివేచనము గలవాఁడు కాఁడు. కాబట్టియే గంధర్వులను మాటనైన దలంపక రణదుర్మదులగు కొందఱ సైనికులం బంపెను. వారప్పుడె సంగర పరికరులై యరిగి గంధర్వులం జూచి వారితో మహాబలశాలి, మహాబాహుఁడు, రణదుర్మదుఁడు, ధృతరాష్ట్రపుత్రుఁడునగు దుర్యోధనుడు తన దేవీకదంబంబుఁగూడి యిందుఁ గ్రీడింపనరుదెంచుచున్నవాఁడు. మీరు త్వరగా, తొలఁగిపొండు. లేకున్న గొప్ప విపత్తు మీకుం గలుగవచ్చునని హెచ్చరించిరి. వారామాటల విని యొకరిమో మొకరు చూచుకొనుచు మందహాసముచేసి మీ రాజునకు బుద్ధి చాలఁ దక్కువ. తనశక్తి పరశక్తియు నెంత యని యెఱుఁగడు. మదించినవాఁడు. మానప్రాణంబులఁ గోల్పోవఁ దలచినాఁడేమో, మీరైన నూరక తొలఁగి పొండు. లేకున్న మీ వార్త నింటఁ జెప్పునట్టివారుండరేమో! ఇఁకఁ జాలును. పొండు పొండని యహంకరించి మాటలాడిరి.

దుర్యోధను సైనికులు మగిడి చని యా వృత్తాంత

మెల్ల నున్న దున్నట్లు రాజునకుం దెల్పిరి. ఆతండు పెనురోషంబున మండిపడియెను. తమ్ముల నుం దండనాయకుల నుం జూచెను. కన్నులనుండి నిప్పుకలు ధరణిం బడుచుండ నౌరా యని యహంకరించుచు మీరిప్పుడే సైన్యములం గూడి చని యా గంధర్వుల దోర్గర్వంబుమాన్పి సరోవరం బాక్రమింపుడు. అని పలుకుచు గంధర్వులకు సహాయంబుగా నిలింపపతియరుదెంచినను లీలామాత్రంబున జయించునది. అని యాజ్ఞాపింపఁ దత్సేనవరులతులచతురంగబల సమన్వితులై సింహనాదముల దిక్కులం బిక్కటిల్లఁ జేయుచు నిరతిశయరయంబునఁ బోయిరి. వారి కడ్డమువచ్చి కొందఱు గంధర్వులు ప్రియపూర్వకభాషణంబుల మీ రేలయిటకువచ్చెదరు? మాతోడి విద్వేషంబు మీకు లగ్గుగాదు, నిలువుండనిరి. ఆమాటలకు మఱింత గర్వించి సింహనాదము లొనరించి వారిపై నిశాతవిశిఖంబుల ప్రయోగించిరి.

## — గంధర్వులు కురువీరులతోఁ బోరుట —

గంధర్వులాతురంపడక రాజున కెఱింగింపఁ జిత్రసేనుండు మండిపడి మీరెల్ల నరిగి దుర్జాతులగు ధార్తరాష్ట్రులం బొదివి వధింపుడు. పోనియకుండని శతసహస్రసంఖ్యలుగా గంధర్వులం బంపెను. వారఖిలాస్త్రశస్త్రపరికరులైపరుగిడి కురురాజయోధవీరులందఱికి విచిత్రరీతుల శరంబుల బ్రయోగింప దుశ్శాసనాదులుభీతులై దుర్యోధనునికడకుం బాఱిరి. కర్ణుండొక్కరుండే సుస్థిరుండై నిలువంబడి గంధర్వుల నిలువరించి యుద్దండతర కోదండ విసర్గత వివిధ సాయకజాలంబుల జిత్రసేను సేనల రూపుమాపెను. దుర్యోధనుండును నిజబలంబులంగూడి కర్ణు

సకుంగోడుపడియె. అప్పటియుద్ధము వర్ణనాతీతముగానుండెను. కొంతసేపటిలో గంధర్వులు పాఱిపోయిరి. ఆవిధము విని చిత్రసేనుఁడు తాను సమరభూమికేతెంచి మాయా సంగర కోవిదుండు కావునఁ గురురాజసేనలం జీకాకుపఱచెను. గంధర్వులును దొరకు బాసటయై నిలిచి పోరసాగిరి. వారి యుద్ధతి కోహటించి కురురాజ సైనికులు ధర్మనందనుఁ డున్న కడకుం బాఱిరి. కర్ణుండు దెరలక నిలిచి గంధర్వులం జెండాడుచుండు సంత నందఱాతనిం జుట్టుకొని కొందఱు గుఱ్ఱములను, మఱి కొందఱు సూతుని, ఇకనుం గొందఱు ధనుర్దండము నీ రీతిగా సాధన హీనుంగా నొనరించిరి. వికర్ణుని రథంబెక్కి రాధేయుం డించుక కాలికి బుద్ధిచెప్పెను. దుర్యోధనుఁడు కర్ణుని వెంటం బాఱిపోవక ధీరునివలె నిలిచి విక్రమంబు చూపసాగెను.

—♦ దుర్యోధనని భీమార్జునులు బంధముక్తుఁ గావించుట ♦—

అంతఁ జిత్రసేనుఁ డాతనిం దలపడి విరథుం గావించి కేశాకర్షణంబున నేలంబడవైచి పెడకేలు గట్టి సింహనాదంబు చేసెను. తక్కుంగల గంధర్వులు తత్కాంతలను దుశ్శాసనాదులంబట్టి కట్టివైచి చిత్రసేనుని కప్పగించిరి. మిగిలిన మంత్రులును దుర్యోధనానుజులును బెలుచనపోయి ధర్మరాజు శరణుసొచ్చి యార్తులై,

మ. ఘనబాహాబలదుర్నివారమహిమన్ ♦ గంధర్వవీరుల్ సుయో
ధనుఁ దత్కాంతలఁ, దత్సహోదరులఁబం ♦ ధప్రాప్తులం జేసి, కై
కొని వేపోవుచు నున్నవారదె రిపు ♦ క్షోభంబుఁ గావించి నీ
యనుజవ్రాతముఁ గావవే కరుణనిం ♦ డారం గరాజోత్తమా.

అని ప్రార్థించిరి. ఆమాటలు విని చిఱునగవు మోమున జిందులాడుచుండ భీమసేనుండు ధర్మనందనుం గాంచి, యగ్రజా! మనము చేయఁదగు కార్యము గంధర్వు లొనరించిరి. కాన మన పని చాలఁదగ్గినది. ఇద్దిగదా యదృష్టము. ఏకష్టము లేకయే మనకు జయము కలిగెను.

తే. పుట్టుఁగల్లరులై, పాప ♦ ములకు నెల్ల
దిట్టలై, లోకములచేతఁ ♦ దిట్టుపడిన
కట్టఁడికి, నిట్టికష్టంబు ♦ గననొనర్చి
తగవిధాత్రుఁడు చతురుఁడై ♦ నెగడెనేఁడు.

మ. విపరీతస్థితినొంది, ఘోరవిపినో ♦ ర్వీవాసులై, నిత్య దుః
ఖపరాధీనతఁ దూలిరంచు మనలన్ ♦ గర్వోద్ధతస్వాంతుఁడై
యపలాపింపఁగవచ్చిదుర్ణయపరుం ♦ డాధార్తరాష్ట్రుండు దో
షపరీతాత్ముఁడు తత్ఫలంబుఁ గుడిచెన్ ♦ సత్యంబు సామాత్యుఁడై

కావున వాని విషయమునఁ గరుణపూనవలదు. మంచి కార్యంబు చెల్లెనని నవ్వుచుండగా భీమునిం గాంచి ధర్మరాజు భీమసేనా! ఇది పరుష వాక్యములు పల్కుటకు సమయమా? అయ్యో! దీనులై శరణుచొచ్చిన దిక్కులేకయున్న కౌరవులకు సహాయముచేయుట నీకుఁ దగుగదా! ఏకాన్వయమునఁ బుట్టినవారికి నేకారణంబుననైన విరోధంబు పొసంగినచో సహజస్నేహము తప్పనేరదు. జ్ఞాతిజనులు తమలో నెట్టివారుగాఁ బ్రవర్తిల్లినం దగునేకాని యితరులచేఁ బరాభవంబు గలిగినప్పు డట్టివారికి సాయపడకుండుట నింద్యముకదా! దుర్యోధనుం

డవిసితిపరుండై సభార్యుండై పరులచేతఁ బట్టువడియె. దీని నుపేక్షించినచో మనకుం గులహాని యగును. ఇదియుంగాక శరణాగత రక్షణంబు రాజపుత్రులకుంగూడ నియతధర్మంబు. ఇఁక నీవంటి బాహుబల పరాక్రమ శాలురకు వేర చెప్పనేల? లెమ్ము. నీవును నీతమ్ములును రథంబులెక్కి చని సుయోధను చెఱవిడిపించి రండు. అనుటయుఁ బవన తనయుండు యమ తనయా! యించుకేని అనుమానములేక జలంబుల నన్నుఁ ద్రోయించె. విషాన్నంబు పెట్టించె. గృహదహనము చేయించె. ఇంక నెన్నియో చేయరాని పనులు చేయించె. కొదువలేకుండఁ గపటపు ద్యూతంబు పన్ని రాజ్య మపహరించెను. సభలోనివారెల్ల జూచుచుండఁగాఁ బాంచాలి కొప్పుపట్టి యీడిపించెను. చీరలొలువ నాజ్ఞాపించెను. అక్కటా! దుర్యోధనుఁ డొనరింపని యెగ్గులు కొన్నిగలవే? అట్టి దుష్టునిపై దయచూపు మనుటకు నోరెట్లులాడెను! దాన మనకు ముందు ముందు హానియగుఁగదా! అని పూర్వ వైరంబును దలఁచుకొని పలికెను.

ధర్మజుఁడు భీము నభిమతంబెఱింగి యాతఁడుసాంత్వనమునఁగాని చక్కఁబడఁడని యూహించి, భీమసేనా! లోకమున నెంతదుర్బలుఁడైనను గావుమని దగ్గరకు వచ్చిన నోపినంత సాయము చేయును. ఉత్తమ శూరుండు దీనజనుల తెఱఁగుచూచి యూరకుండునా! ఇంతియగాదు—

క. శరణంబని వచ్చిన భీ
కరశత్రువునైనఁ బ్రీతి ♦ గావఁగవలయున్

గరుసాఁరుల లెక్కఁగిది
యిరువురు సరిగావు దీని • కేధర్మంబుల్.

వత్సా ! దుర్యోధనుండు తన్నువశ్యము మనము విడి పింతుమని నమ్మియుండును. మనకు నిది పుణ్యంబును గీర్తి యును సంపాదింపఁ దగినకాలము. నిన్నింత ప్రతిమాలుట యజ్ఞదీక్షనున్నందున నేఁ బోరామింగాని వేఱుగాదు. వేగంబ చని దుర్యోధను విడిపించునది. సామవచనంబుల నప్పుడి శక్యముగాకయున్న విక్రమంబున వారి నోడించి విడిపింప వలయు. ఇది నా యజ్ఞమును సఫలముచేయు మహాకార్యము. ఈ పాటిమాట పెద్దవాఁడు చెప్పినదని చేయఁదగు. అనిన నెట్లో భీము డంగీకరించెను. అర్జునుఁ డీ కార్యమును సాధించెదనని ప్రతిజ్ఞ చేసెను.

అంత నకుల సహదేవులం గూడి భీమార్జునులు యుద్ధ సాధనంబులఁ గొని ధర్మజు ననుమతింబొంది పయనమైరి. వారిం గూడి సింహనాదంబు లొనరించుచుఁ గురుబలంబు నడిచె. వారెల్ల గంధర్వులను గంధమాదనాచలంబున కరుగుచున్న వారిని గూడముట్టిరి. గంధర్వులును మహాగ్రహంబున వారిం దలఁపడిరి. విజయుఁ డన్నమాటల స్మరించి, గంధర్వులారా ! మాతో మీకు సంగరమేల? దుర్యోధను విడువుఁడు. ఇదిధర్మ రాజునాజ్ఞఅనియె. గంధర్వులయ్యా! ధర్మరాజు మాకుప్రభువు గాఁడు. ఇంద్రుఁడొక్కఁడే మమ్ము శాసించువాఁడు అని పలికిరి. అంత వారికి ద్వంద్వయుద్ధంబు సాగెను. అందర్జునుం డుదగ్ర బాణంబుల వారి దహించుచుండెను. గంధర్వులు మాయఁ

బన్నిన వినువీధి కెగసిరి. అర్జునుఁడాగ్నేయాస్త్రంబున వారి మాయ భగ్నంబుగా నొనర్చెను. ఆ మహాసంగరంబు భూత భయంకరముగ సాగెను. అత్తఱిఁ జిత్రసేనుఁడు పొడసూపిన నర్జునుఁడాత్మ సఖుఁడగునాతని గారవించి దివ్యాస్త్రంబుల నుపసంహరించుకొనిన వృకోదరాదులు భండనంబు మానిరి. నరుఁడార్యా! వీరోత్తమా! మాతోటినీవు సంగరము చేయ ధర్మమగునా! దారానుజులతో దుర్యోధను విడువుము. చిత్రసేనుఁడా మాటలకలరి విజయా! మిమ్ముఁ బరాభవింప వీఁడు వచ్చెనటంచెఱింగి శతమఖుఁడాజ్ఞాపింప నేమరుదెంచి బంధించితిమి. మేమీతని శతమఖుకడకుంగొని చనుచున్నవారము. కాన మామార్గమున కడ్డురాకుము. మిత్రుడవు గావున నున్నదున్నట్లు వివరించితిని. అన విని యర్జునుండు మహాదరంబున సఖా! ఈదుర్యోధనుఁడు మాసోదరుఁడు. కావున వీని విడువుము. ఇది ధర్మరాజు నాజ్ఞ. ఇంద్రుని పనుపుగాని మఱెవ్వరి యాజ్ఞ కాని కానిండు. ధర్మరాజు మాట మీఱఁ గూడదు. వీనిం దోడ్కొని నా ప్రియము నిమిత్తము రమ్ము. అన దాని కొడంబడి చిత్రసేనుఁ డాకురుపతిం దోడ్కొని ధర్మరాజు పాలికిం బోయెను. ధర్మజుండా చిత్రసేనుఁ నతిప్రియంబునఁ బూజించి మహానుభావా! యీ సుయోధనుండు సానుజామాత్యుఁడై మీచేత వధింపబడకుండుట కడుంగడు మేలయ్యె. వీఁడు మీ కెట్టి యుపకార మొనర్చినను వాని సహించి మాకుఁగా వీనిని విడువవలయు. అని ప్రార్థింపఁ జిత్రసేనుఁ డట్లగాక యని దుర్యోధనాదుల నందఱ వదలి పాండుపుత్రుల నామంత్రణంబు చేసి సురపురి కరిగి తత్ప్రకారం బంతయు

శతమఖుకడ వినిపింప సమరసహాతులగు గంధర్వులసమృత వృష్టిని బ్రదికించి ధర్మరాజు నీతికి మెచ్చెను.

ఇచ్చట ధర్మరాజు దుర్యోధను బంధవిముక్తుఁగా నొన రించి మెల్లన వానింజూచి.

ఉ. ఎన్నఁడునిట్టిసాహసము ♦ లింక నొనర్పకుమయ్య దుర్జనుం
డన్నన సాహసక్రియల♦యందుఁ గడంగినశించుఁ గావునం
గ్రన్ననతమ్ములందొరలఁ♦గైకొని యిమ్ములఁబొమ్మ వీటికిన్
సన్నుతదీసికొండొకవి♦షాదముఁబొందకుమీ మనంబునన్.

అని బుద్ధిచెప్పి సాగనంపెను.దుర్యోధనుం డామాటలకు బదులాడ నేరక దీనాననుండై చనియె.

## —♦ పాండవులు కామ్యకవనంబునకుం బోవుట ♦—

దుర్యోధనుం డరుగఁ బాండవు లాతని దుశ్చరితంబు లకుఁ గటకటం బడి యింకనైన బుద్ధిరాకుండునా యని, యూహించుచు ద్వైతవనముననుండిరి. ఒక్కనాఁడు ధర్మరాజు నిద్రించుచుండఁగా నాతని కొక స్వప్నము వచ్చెను. అందు నాద్వైతవనంబునంగల మృగఁబులన్నియుఁదోఁచి, ధర్మరాజా! యని సంబోధించి కన్నీరుమున్నీరై ప్రవహించుచుండఁదమ్మీ క్షింగించి మీరునిత్యము ప్రయత్నపూర్వకముగా మమ్మువధి యింపమానంశంబిపు డల్పావశిష్టంబైనది. మేముబీజమాత్రమే దక్కియున్నాము. మాదుఃఖమునకు మేరలేదు. ఇంకనైన మీరు వేఱొకవనమున కరిగి మమ్ము బ్రతుకునట్లు చేయుఁడు కరుణ చూపుడు అనుటయు నాతఁడప్పుడే వాని కభయ మిచ్చెను.అంతటమెలఁకువతోఁచెను. వెంటనేయనుజన్ములకా

వృత్తాంతము నెఱింగించి, సోదరులారా ! మన మీ వనముచేరి పదునెనిమిది నెలలయ్యెను. వేఱొక వనమునకుఁ జనుట మేలని తోఁచుచున్నది. ఇపుడు కామ్యకవనము బహుమృగ సమాకీర్ణంబై నిర్మలకమలాకరంబుల మిగుల మనోహరంబై యున్నదని వింటిని. కావున మనల నచటికిఁజని యందుఁదృణబిందు నాశ్రమంబున వసియింతము. ఇది లెస్సయని నాకుం దోఁచుచున్నది. అనినం దమ్ములు, దేవా! మీ రెట్లు నిశ్చయించిన నట్లే నడువఁగలవారమనిరి.

ఆర్యబాలకులారా ! ఇప్పట్టున మీ మనసుల కొక సందియ ముదయింపవచ్చును. ధర్మరాజు స్వప్నమున మృగములు కనఁబడవచ్చుఁగాని యందు బ్రదికియున్న మృగములు కనఁబడి తమ యార్తిఁ దెలుపుకొనుట యెట్లు? అని. ఇది యుదయింప దగని శంక కాదు. కావుననే నాలుగు మాటలు దానికి సమాధానముగా నిట వ్రాసెదను. మృగములు కలలోఁ గన్పడుట యరుదు కాదు. కాని తమ యార్తిని దెలుపుకొనుటయే యిటఁ జిత్రము. దీని తత్త్వమేమనగా ఎవ్వరుగాని సృష్టిని నశింపఁజేయు కార్యము చేయుచుండఁగా భగవంతుఁడు వారిచిత్తవృత్తుల కనువగు రూపమునఁ దోఁచి యా దుష్కార్యమున వారు విశ్రాంతి నొందఁజేయును. ధర్మరాజు పరమ ధర్మ నిరతుఁడు. కాన సాంత్వసూక్తుల నాతనిచిత్తవృత్తి నిమార్చెను. భీకరచిత్తముగల వారలైనచో వారికతిభీతిని గల్గించి యా దుష్కార్యమునుండి మరలించును. ఇది భగవత్కృత్యము. వేఱు కాదు. కథారూపమున దెలుపుట కట్లు చెప్పబడినది. ఒకానొక సమయమున, నొక దుష్టధార్మికముగా బరమసాధు

వగును. కారణమేమి? భగవంతుని యూహయే యాతనినట్లు మార్చివదని నమ్మరు. ఈసిద్ధాంతమును మీరు నమ్మినచో నిట్టి విషయము లనేకములు తప్పులుగాఁ దోఁపక మహానంద కరములగు భగవంతుని కృతులుగాఁ దోఁచును. దాన మీ కెంతో మేలుగలదు. మహాపురుషుల జీవితము లెట్టివో తెలియును. భగవంతుని యందు భక్తికుదురును. దాన మీ జీవితము పరమపవిత్రమగును. మీరు లోకమున కెంతయో యుపకారము చేయజాలుదురు. స్వార్థపరులుగాక పరోపకార తత్పరులగుదురు. భరతభూమి మీవంటి సత్పుత్రులను బడసితి గదాయని సంతసించును. ఇంక నవ్వలికథ వినుఁడు.

ఆ మఱునాఁడే వారెల్లఁ బయనమై కామ్యకవనమున కరిగి, యందు దృణబిందు మహాముని యాశ్రమము చెంత నివసించిరి. అట శాకంబుల, మూలముల, ఫలంబుల నాహార ముగాఁ గొనుచుండిరి. ఒండొరుల కష్టములు చూచి వగచు చుండిరి. జూదము మనల నింతకుం దెచ్చెఁగదాయని కుందు చుండిరి. అప్పటికి వారి కరణ్యావాసంబునఁ బదునొకండువత్స రములు చెల్లినవి. పండ్రెండవ వత్సర మారంభమయ్యెను. ఆ తరుణమున వారికి కలుగు వగల మానుపబూని వ్యాసమహర్షి యరుదెంచెను. వారిచేఁ బూజితుండై ధర్మరాజుం గాంచుచు,

ఉ. కాలవిపర్యయంబునసు♦ఖంబును దుఃఖమువచ్చుచుండునె
క్కాలమునేరికిన్ ధ్రువము♦గాదుసుఖంబునుదుఃఖముం మహీ
పాల బుధుండుతద్ద్వివిధ ♦ భంగులెఱింగి, ప్రమోదఖేదసం
శీలుఁడుకాఁడు రెంటను బ్ర♦సిద్ధపథంబున నప్రమత్తుఁడై.

క. క్షమయు నహింసయు సత్యము
సమతయు నింద్రియజయంబు ♦ శమముఁ, బరిత్యా
గముఁను దపోలక్షణములు
క్రమమున నిన్నియును మోక్ష ♦ గతికారణముల్:

అని పలుకుచు వారి మనస్తాపంబు బాపి శాంతి సుఖములు నెలకొన వ్రీహిద్రోహికాఖ్యానములోనగు నద్భుత చరిత్రములఁ దెల్పి చనియెను. మార్కండేయుం డరుదెంచి రామాయణాది దివ్యగాథల నెఱింగించెను. అప్పటికిఁ బండ్రెండవ సంవత్సర మించుమించుగాఁ బూర్తియయ్యెను. మార్కండేయుం డరుగుచు మీరు మరల ద్వైతవనంబునకు జనుండని యుపదేశించి పోయెను. తమ మేలుగోరి చెప్పిన యామునివరుని పలుకులు చెల్లించిరి. మరల ద్వైత వనంబును జేరిరి. ఒక్కనాఁడు ధర్మరాజు సుఖాసీనుఁడై యుండెను. ఆతని పాలికొక బ్రాహ్మణుండు సంభ్రమంబునఁ బఱతెంచి యిట్లు వేఁడెను:

—♦ బ్రాహ్మణునియరణి దెచ్చుటకు ధర్మరాజుగుట ♦—

ధర్మరాజా! వృక్షశాఖకుఁ దగిల్చిన నాయరణి నొక మృగమరుదెంచి యాకొమ్మ నొరసికొనుఁడు దానిశృంగ మున కది తగిలెను. దానింగొని యామృగము పరుగెత్తెను. ఆయరణియే నాకు నిత్యకృత్యముల కుపయోగ పడునది. దానిందెచ్చి యిచ్చి నావిధులకు బాధలేకుండఁ జేయుము. సకల ధర్మమూర్తివి కావున నీకు విశేషించి ధర్మము లెఱిం గింపఁబూననని యత్యాకులితస్వాంతుఁడై ప్రార్థించెను. ధర్మ

నందన డా భూసురుని ప్రార్థనంబున కలరి వెంటనే చాపమును గ్రహించి తమ్ములంగూడి యామృగము చనిన గుఱుతులం బట్టి పోయిరి. కొంతదూరమఱుగనామృగము దృష్టికిందగిలెను. దానిపై నైదుగురును బటుతర సాయకములు ప్రయోగించిరి. కాని యందొక్కండైన దాని చెంతకుం బోవంజాలకుండెను. ఇక దానిం దగులుట యెక్కడిది? అదియచ్చెరువును వారికిం గల్గించెను. అంతటనామృగమిటునటుపడుగిడుచువారిందోడ్కొని యొక ఘోరారణ్యభాగంబున నదృశ్యంబయ్యెను. వారు చేయునదిలేక యొక్క వటవిటపి మూలంబున నలసటం దీర్చుకొన నాసీనులైరి. అపుడు నకులుండు ధర్మనందనుం జూచి యగ్రజా! కులశీలోన్నతిగలిగి నిశ్చల కరుణాపరతంత్రులమై ధర్మసంగ్రహము చేయుచున్న మనకిట్టి యలజడి వచ్చుటకేమి హేతువోయని ప్రశ్నించెను. యమతనయుండు మహాప్రాజ్ఞుండు కాన నాతనింగాంచి యనుజన్మా! సుఖదుఃఖములకుం గారణము తాం బూర్వజన్మమునం జేసికొన్న కర్మమే కాని యన్యముగాదు. కర్మమునగాక యేదియు లభింపదు. అని హితము తెల్పెను. అవ్వల భీమసేనుం డానకులుం గాంచి వత్సా! ప్రాతిగామిపోయి పాంచాలిని ఋతుమతియైయున్న దానిని గొలువులోనికిం దోడుకొని రాంగాం గన్నులారం గాంచిన నాకపుడుదయించిన కోపంబున నాంబికేయతనయుల నందఱ వధింపక మానినందున నీయడరు మనకుం గలిగినదనెను. అవ్వల నర్జునుండు సోదరా! ఆనాంటి సభలో సూతతనూజుండు పేర్చిపల్కిన తులువపలుకులు విని కోపమూనక భీతుండైన-యట్లుడవులకు వచ్చినందున నిట్టి కీడులు మనకుం

గల్గినవని పలికెను. సహదేవుండవ్వల నన్నంజూచి, సహోదరా! దుర్మార్గవర్తకుండై కపటద్యూతంబు పన్నిన శకునింబట్టి వధింపక విడిచితిని. ఆ ఫలమున మనకిట్టి పాటులుగలిగె ననియెను.

ఇట్లు తమ్ములందఱు నాడు మాటలు వినుచుండి ధర్మరాజు నకులుంగాంచి వత్సా! నీ సోదరులందఱు డప్పికొని యున్నవారు. నీవీమహీరుహరాజంబు నెక్కి జలంబులున్న చోటు పరికింపుమని యాజ్ఞ చేసెను. నకులుండప్పుడే యా భూరుహంబెక్కి నలువలంకులంగలయంజూచి దూరంబున సలిలంబు లున్నవని యన్న కెఱింగించెను. ధర్మసూతియు నట్లైని వేవోయి జలపానంబుచేసి మాకును సలిలంబులం గొనిరమ్మని యానతి చేయ నాతండట్లయని వృక్షంబునుండి దిగి యతిరయంబునం బోయి ముందట మిగుల మనోహరంబై శీతలచ్ఛాయాద్రుమ సాంద్రతీరంబై సురుచిరసరసిజనికర పరిభూషితంబు నగు సరోవరంబును గాంచి మహానందంబున నందు జలపానంబు చేయంబోయెను.

—♦ నకుల ప్రముఖులు యక్షుని నిరాకరించి జలములం ద్రావి మూర్ఛిల్లుట ♦—

జలంబుల చెంతకుంబోయి పాద ప్రక్షాళనము చేయబూను సమయంబున నొక్క యశరీరవాక్కు :

క. ఓయన్న యీతటాకము
నాయది నీవీజలముం గొ ♦ నంగవలతేన్
నాయడిగిన ప్రశ్నములకు
ధీయుత యుత్తరములిమ్ము ♦ తేటపడంగన్.

ఆమాటలను వినియు నకులుఁడు దాని ననాదరమునఁ బాటింపక సరస్సు నందలి తీయని జలమును ద్రావెను. ఆ క్షణము నిశ్చేతనుఁడై పడియెను. ధర్మరాజు నకులుఁడు రాక తడవు సేయుటకుం గారణ మేమని యాలోచించి సహదేవునిం గాంచి మీయన్న జలంబులుగొనిరాక తడసె. నీవరిగి యతనిం దోడ్కొని జలంబులంగొని రమ్మనిపంపగా నాకుమారుండరిగి సరస్సుఁగాంచి యందుఁబడి శవమువలెనున్న యన్న తెఱఁగును జూచి శోకము విస్మయము పెనగొనుచుండ నేమినిమిత్తంబున నిట్లుపడియెనని చింతించుచు దప్పిచేమి నాపజాలక జలంబులం దగిన నెప్పటియట్ల ఆ మహాభూతంబు,

ఆ అనఘ యీ జలాశ ♦ యము నాయధీనంబు
సాహసంబు చేసి ♦ చనదు చొరఁగ
నాదు ప్రశ్నములకు ♦ నలినుత్తరములిచ్చి
వారిఁగొనుము నీవు ♦ వలసినట్లు.

అని పలికెను. ఆమాటలు వినియు బదులు చెప్ప నూహింపక జలంబులం ద్రావి కాలాహిదష్టుని విధంబునఁబుడమింబడి నిశ్చేతనుం డయ్యెను. అంత నట యుధిష్ఠిరుఁ డర్జునుం జూచి వత్సా! సోదరు లిర్వురు పోయి రారైరి. ఏటికేఁ దడసిరో తెలియకున్నయది. ఇది మహారణ్యము. త్వరగా నీ వరిగి వారి నిర్వురఁ దోడ్కొని జలంబులఁగొని రమ్మాయని త్వరపడి పలికెను. ఆ మాటల శిరసావహించి యర్జునుం డతిత్వరితగతి నరిగి యాకొలను తటంబునఁ బడియున్న మాద్రీతనయుల నిద్దఱంజూచి విస్మయావిష్టమానసుండై విషాదంబున నేమి

యుండక సమీపమున నలుదెసలు పరికించి యెవ్వరిం గానక తొలుత జలంబులం ద్రావి కిర్జుంబునటజి చూతమని జలంబుల చెంతకుం బోయెను. నీటియొద్ద నర్జునుండు చేరంగనే యాకాశవాణి

ఆర్యా!

మ. బలిమిం జొచ్చిన నెట్టివారికయినం ♦ బ్రాణంబుపై వచ్చి నీ
సలిలావాసము మత్పరిగ్రహముతృ♦ష్ణార్తుఁడ మొందక జలం
బులు త్రావన్ వల తేఁ ప్రశ్నములకుం♦బొందొందఁగా నుత్తరం
బులు నాకిమ్ము నుడున్ మనంబున బృథా♦పుత్రుండు సక్రోధుఁడై.

దొంగవలె డాఁగియుండి దుర్వాక్యములు మాటలాడిన జెల్లనిత్తునా? నీ యెలుం గడఁగఁ జేసెద చూడుము: అని శబ్దభేది బాణపుంజంబులఁ దద్వచనములు వినఁబడిన సవ్వడిం బట్టి ప్రయోగించెను. ఆతని మార్గ్వనాద మతి భయంకరమై మించెను. ఆబాణము నేదెసకేగెనో కాని మాటలట్లే వినఁబడు చుండెను. అంతలో దప్పియాపరాని నాకొలనుసొచ్చి వివశ హృదయుండై యిలకు నొరిగెను. కౌంతేయాగ్రజుడంత నర్జునుండు తడయుటకుఁ గతంబెఱుంగక భీమసేను నవలోకించి నకుల సహదేవులు విజయుండును రాకతడసిరి. కారణము తెలి యక నాచిత్తము తత్తరిల్లుచున్నది. నీవరిగి త్వరగా రమ్మా యని పంచిన నాపవనతనయుండు మారుతవేగంబునం బోయి కొలనుతీరంబున నిద్రంజెందినట్లు పడియున్న తమ్ములంగాంచి దుఃఖావిలమానసుండై యిది మనుష్యకృత్యముగాదు. దేవతల కృత్యమై యుండనోపు. దీనికిం గారణము తరువాతఁ జూచెద. యని జలంబులం ద్రావ సరసులోనికి దిగియెను.

అపుడంతరిక్ష గోచరంబైన భూతం బెప్పటి యలుం గున నయ్యా! నీవిట్లేలసాహసంబుచేసెదవు? ఈకొలననాపూర్వ పరిగ్రహము. నీకు శక్తియున్న నా ప్రశ్నలకు నుత్తరము లిచ్చిజలంబులంద్రావుము. నీతమ్ములిట్లే నా పలికినపలుకులకు దెస నాదరంబు చేయక యీ స్థితినొందిరి. అనుఁడు పావని యప్పు లుకుల జెవులఁజొరనీయక జలంబులంద్రావి యచ్చోటనే మూర్ఛమునింగెను. ఇటఁ బాండవాగ్రజుండు నలుగురు తమ్ము లురాక మసలుటకుఁ గతంబెఱుంగఁజాలక యత్యంత విషాద మొంది చయ్యనలేచి వారుపోయిన యడుగులజాడనే పట్టి పోయి మనుష్యశబ్దమే వినరాక మార్గము స్పష్టముగ లేక కొండలు వృక్షములుఁ నిండియుండఁ బొదరుటిండ్లు వరుసలు నడువఁజొటీయక వన్యమృగములు తిరుగుచు భయంకరంబున ధ్వనించుటచే గహనంబను పేరు సార్థకంబుగ నొప్పు ననేక విధవిహంగమరవంబులు చెవుడ్పడఁజేయ దుర్భరకష్టములపాలు సేయనున్ననావనంబుసంబోయిపోయి కమలాకరంబునఁగనిదాని కడఁజచ్చినట్లు పడియున్న భీమార్జుననకులసహదేవులంజూచెను. వారింగాంచినంతనే ధర్మనందను చిత్తము ప్రమాన్పడియెను. ప్రాణములు తనువు నెడఁబాయ సిద్ధముగ నుండెను. దీర్ఘ నిశ్వాసము లెడసేయక వెడలుచుండెను. ఓర్పెచ్చటికో పోయెను. విస్మయముమాతావునఁ బాముకొనియెను. ఊహలు ప్రవహింపక మందగించెను. అత్తఱి నాతని రూపము చిత్ర ప్రతిమతోఁ బోల్పుట ప్రమాదమే కాదు. అసంగతముకూడ గాదు. కొలఁది నిమేషములకు నాతని హృదయమున బూర్వ పుణ్యా విశేషంబున ధృతి తల చూపెను. నలువురు సోదరులను

జూచెను. నలుదెసలు పరికించెను. అప్పు డాత్మగతంబున నితరులు వచ్చిన జాడలేవియు గానరావు. ఇటనుండి యెవరేని బోయిన గుఱుతులు కూడ లేవు. బాహుయుద్ధము చేసిన చందము గానరాదు. వీరి యవయవము లించుకయుఁ గందవు. ఏల యిట్టులైరో తెలియకున్నయది. ధృతరాష్ట్ర నందనుఁడు మహాక్రూరుఁడు. మిగులఁ గుత్సితుఁడు, పాపబుద్ధి గలవాఁడు. వాని మామ శకుని పాపాత్ములలోఁ బాపాత్ముఁడు. పెక్కు మాయలెఱుంగు. ఏమి ద్రోహమునకు వీరిని గురిచేసెనో! ఎట్టివారైనఁ బాపకారుల నమ్మరాదు. చక్కఁగా వారి మోములం గాంచి వీరి ముఖవర్చస్సు తగ్గలేదు. హస్తములయుఁ బాదములయు గాంతిఁ యించుకయుఁ జెడకుండెను. ఇట్టి వీరిట్లు పడిపోవుటకు జలము లివి విషదగ్ధములై యుండునా యను నూహ కల్గుచున్నయది. ఏమి మాయయో యెఱుంగఁ జాలకున్నాఁడ. నా యూహలిపుడు సత్యదూరములుగ నున్న యవి. అని యంతలోఁ జింత మదిఁదోచిన నా పృథాతనూజాగ్రజుండు,

చ. పుడమియు సర్వసంపదలు ♦ బోల్పుఱవైరుల పాలుచేసియి
యడవికి వచ్చి భీకర మృ ♦ గావలి ప్రొత్తుననున్న వీరి వె
న్నడికొనియిట్లుచేసెనె యు ♦ నాథులఁబోలెవిధాతృనింకనె
క్కుడఁజనువాఁడనేదిగడఁ ♦ గాఁదరియింతుఁదురంతదుఃఖముల్.

అక్కటా! నేనొంటిగానింటికింబోవ దనయుల యిడుములకు నిరతంబు కుందుచు భగవంతునిఁబ్రార్థించుచున్న నాతల్లి కుంతీదేవి నా కెదురుగ వచ్చి వత్సా! నాఁడు ప్రియానుజులు

నల్వురు కూడరా నడవుల కరగితివిక దా! ఇపుడు నీ వొంటిగా వచ్చుచున్నవాఁడవు. తమ్ము లేరి? అని యనినవాతల్లితో నేమని బదులు చెప్పుదును? ద్రోణ, ద్రౌణి,కృప, భీష్మ,విదురులువచ్చి కుశలప్రశ్నము చేసిన వారికే నేమని కుశలమును దెల్పుదును? తొలఁగరాని యిడుమ నన్నలముకొనియె.

అని యిట్లనేక భంగుల వగచి యా ధర్మనందనుండు తృష్ణ కోర్వఁజాలక సరోవరంబులోనికిం దిగి జలపానంబు చేయ నుంకించుతఱి నొక యాకాశభూతంబు పేరెలుంగున,

మ. వినుమే నొక్క బకంబ నిక్కలుషవృ♦త్తిన్నాథనాసొమ్ము నీ
యనుజుల్ మద్వచనంబుఁ గైకొనక తో♦యాస్వాదులై యివ్విధం
బునఁ బ్రాణచ్యుతిఁబొందిరీవును గడున్♦మోహంబునన్ సాహసం
బునకుంజొచ్చిన నట్లయయ్యెదుఁజుమీ♦మున్నట్టి వారించితిన్.

అయ్యా! నేనడిగిన యర్థములకు సదుత్తరము లిచ్చి పయఃపానము చేయుము అని హెచ్చరించెను. ఆ మాటలు విని పరిశుద్ధాత్ముఁడగు నాయుధిష్ఠిరుఁ డాకసము వైపునకు జూడ్కి నిగుడించి, మహాత్మా! నీవు బక రూపంబును ధరించిన రుద్రుండవో, యగ్ని దేవుఁడవో, వాయు భట్టారకుండవో కావలయు అట్లుగాదేని నా సోదరుల నప్రతిమానుల నిట్లు పడఁద్రోయఁ జాలుదువే? పక్షులకిట్టి బలంబుండ జాలదు. సురాసురులకుం గూడ నా తమ్ములు దుర్జయులు. ఇట్టి వీరి నిట్లు జేసితొలంగియున్నవాఁడవు. నీపలుకులువినిన నాకత్యద్భుత భయకౌతుకంబు లొక్కటిం బొడమెడిని. నీవెవ్వఁడవు? నీ తలంపేమి? తెలియఁబలికి నా హృదయవేదనఁ దొల

గింపుమా యసిన నదృశ్య భూతంబు కౌరవేంద్రా! నేను బకంబనుగాను. ఒక్క యక్షప్రవరుఁడను. నీ తమ్ములు నానిక్కృతిజేసి యిటుపడిరి. అని పలికి యప్పుడే ధర్మసూతి మ్రోల.

మ. నిలిచెం దాళసముచ్ఛ్రితాంగుఁడు మహా♦నిర్ఘోషసంతర్జితా
ఖిలభూతప్రకరుండు దీర్ఘవిపుల ♦ గ్రీవుండు దంష్ట్రాసము
జ్జ్వలవక్త్రుండు విరూపలోచనుఁడు తీ♦వ్రస్ఫార తేజోఘనుం
డలఘుండాసరసీతటాగమునస♦య్యక్షుండు ఘోరాకృతిన్.

అట్లు నిలచి యుధిష్ఠిరునితో నయ్యా నా యానతి గైకొనక యెవ్వరేని జలంబుల నిందుఁ ద్రావిరేని చత్తురు. చక్కని విచారశీలుఁడవుగాన నీవట్లు చేయనైతివి. కాఁబట్టి నాప్రశ్నములకుఁ బ్రతివచనంబులు పలుకుము. అనుటయు గాంతేయాగ్రజుఁడు, మహానుభావా! నీచిత్తంబున కెక్క నట్లుగా నుత్తరంబులు చెప్ప నల్పజ్ఞుఁడనగు నాఁబోటివానికి శక్యంబగునే! ఐనను నాయెఱింగినంతవట్టు పలికెద. ఆనతిమ్ము మహాత్మా! యని యంజలింబట్టి ప్రార్థించెను. అంతనా యక్షుం డిట్లు ప్రశ్నించెను.

—♦ యక్షప్రశ్నములు – వానికి నుత్తరములు ♦—

ప్ర॥ ౧. క. దినకరునెయ్యది నడపును
దినకరు నెవ్వారుగొలిచి ♦ తిరుగుదురద్దే
వునియస్తమించుటేమిట
ననఘుతదాధార భూత ♦ మదియెయ్యదియో?

ఉత్తరము: మహాత్మా! సూర్యుని నడపునది బ్రహ్మము. ఆత నింగొలిచి దేవకోటి నడచుచుండును. ధర్మువుచేన స్తమితు డగును. ఆమహాత్మునకు సత్యమే యాధారమని పెద్దలు పలుకుదురు. అనిన యక్షుండు మరలనిట్లు ప్రశ్నించెను.

ప్ర॥ ౨ క. ఏమిట శ్రోత్రియుఁడనఁజను
నేమిటఁగడు మహిమ వడయు • నిమ్మగఁ బురుషుం
డేమిట సహాయయుతుఁడగు
చేమిటనగు బుద్ధిమంతు • డేర్పడఁ జెపుమా.

ఆ ప్రశ్నమును విని ధర్మరాజు బదులిట్లుపలికెను:

ఉత్తరము: వేదమునలన శ్రోత్రియుఁడగును. సాధు తపస్సుచే మిగుల మహత్వమునొందును. ధైర్యమున సహాయము గలవాఁడగు. బుధులను సేవించుటచే మిగుల బుద్ధిమంతుఁ డగు. ఆ పలుకులువిని యక్షుండు మరల నిట్టులడిగెను.

ప్ర॥ 3. ఏమిశతమున భూదేవుఁ • డెసఁగు దేవ
భావమున నాతనికి సాధు • భావమెవ్వి
ధముననగు నసాధుత్వ మె • ద్దానఁ జెందు
మానుషుండగు నాతడె • ద్దానఁ జెపుమ.

ఆ ప్రశ్నరీతి నాలకించి యుధిష్ఠిరుం డార్యా!

ఉత్తరము:—అధ్యయనమున దేవభావమొందును. అతిశయ వ్రతశీలత్వమున సాధుభావ మాతనికింగల్గు. విశిష్టవృత్తిని వదలుట నసాధువర్తనబడు. శుచిత్వవియతి లేక మృత్యుభీతి సంగతి మానుషుండగును. ఆమాటల కలరి యక్షుండు మరల నయ్యా,

ప్ర॥ ౨. జీవన్మృతుఁ డెట్టివాఁడో తెల్పుమని ప్రశ్నించెను. దాని విని యతఁడు.

ఉత్తరము: దేవతలకు, అతిధులకు, భృత్యులకుఁ బెట్టక భుజించు నాతఁడు జీవన్మృతుఁడగునని పలికెను.

ప్రశ్న ౩.

చ. విని మగుడంగ వాఁడు పృథి ♦ వీపతిఁ జూచి ధరిత్రికంటెఁ బ్రే
గనయగుఁ దాని నాకసము ♦ కంటెఁ గడుం బొడవైనదాని గా
డ్పునకును నెక్కుడై జవము ♦ పొంపిరిపోయెడు దానిఁ బూరికం
టెను దరుచైనదానినిఘు ♦ టింపఁగ జెప్పుము నాకు నావుడున్.

ఉత్త : మహాత్మా! ధాత్రికంటెఁ దల్లియే ప్రేగు సుమీ! ఆకా శముకంటె జనకుఁడు పొడవు. వాయువుకన్న మనస్సు కడు శీఘ్రగతిగలది. తృణముకంటెఁ జింత మిగులఁ దఱచు. అనుటయు యక్షుండు మరల నతనితో,

ప్ర॥ ౬. తే. మొనసి నిద్రించియును గన్ను ♦ మూయ దెద్ది
పుట్టియును జేతనత్వంబుఁ ♦ బొరయ దెద్ది
యరయ రూపుగల్గియు హృద ♦ యంబు లేని
దెద్ది వేగంబు కతమున ♦ నెద్ది పొలుచు

ఉత్త : ఆప్రశ్నమును విని ధర్మతనయుం డాదరంబున నో మహాత్మా! నిద్రించియుఁ జేప కన్ను మూయదు. గ్రుడ్డు పుట్టియును బ్రాణమునొందదు. పాషాణమునకు హృదయ ము లేదు. వేగమునఁ బ్రభావమొందునది నది యని బదులు చెప్పెను. యక్షుండా యుత్తరములకలరి మఱియు నాతనిఁ బరీక్షింపఁగోరి,

ప్ర॥ ౭. మార్గమునఁ బోవువానికి, రోగార్తునకు, గృహస్థు
నకు, మృతిఁ బొందిన వానికి నెవ్వరెవ్వరు చుట్టంబులో
వచింపుమని యడిగెను.

ఉత్త: ధర్మరాజు మహానుభావా! మార్గమున నడచువానికి
సార్థము చుట్టము. రోగికి వైద్యుఁడు బంధువు. గృహస్థు
నకు సద్భార్య చుట్టము. మృతునకుఁ దాఁ జేసికొన్న ధర్మము
చుట్టము. అని పలుకఁగనే యక్షుఁడు మరల నతనితో,

ప్ర॥ ౮. క. ఎయ్యది ధర్మమునకుఁ గుదు
రెయ్యది యాశ్రయము కీర్తి ♦ కిమ్మగు మార్గం
బెయ్యది సురలోకమునకు
నెయ్యది సుఖములకు నిక్క ♦ యేర్పడఁ జెపుమా.
అని ప్రశ్నింప ధర్మజుం డాతనితో వినయంబున,

ఉత్త: దాక్షిణ్యము ధర్మమునకు గుదురగు. దానము కీర్తికి
మూలము. సత్యము సురలోకమార్గమునకుఁ జేయూఁత.
సుఖములకు శీలమాధారము. అని తెల్పుటయు నా యక్షు
డానందపరవశుండయ్యు మరల నాతనిఁ జూచి,

ప్ర॥ ౯

చ. నరునకు నాత్మ యెవ్వఁడు ఘ ♦ నంబుగ దైవికమైన చుట్టమె
వ్వరతనికిం దదీయమగు ♦ వర్తన మేమిటి నిర్వహించు భూ
వర యతఁ డేమి పూనియన ♦ సద్గతిఁ బొందు నెఱుంగఁ జెప్పుమీ
వరుదుగ నన్ను నక్కురుకు ♦ లాగ్రణి యాతనితో డనిట్లనున్.

ఉత్త: మహాత్మా!

తే. ఆత్మజుఁడు సువ్వొ పురుషున ♦ కాత్మయయ్యె
నాతనికి భార్య దైవిక ♦ మైన చుట్ట
మతని జీవిక పర్జన్యు ♦ కతనఁ జెల్లు
నతఁడు దానము గొనియాడి ♦ యతిశయిల్లు.

అని పలికెను.

ప్ర॥౧౦.

చ. అనవిని మేటిధర్మమగు ♦ నట్టిదియెయ్యది యేదియెప్పుడుఁ గా
దనియగఁ బండియుండునది ♦ తంబుగ నెయ్యదిని గ్రహించినం
దనరుఁ బ్రమోదసిద్ధినియ ♦ తంబుగ నెవ్వరితోడిసంధియెం
దును వికలంబుగాదు పరి ♦ తోషమెలర్ప నుపన్యసింపుమా.

అని ప్రశ్నచేసెను. ధర్మపుత్త్రుఁడును లోకారాధ్యా!

ఉత్త: ఆ. వినుమహింసమేటి ♦ యన జను ధర్మంబు
యాగకర్మ మెపుడు ♦ నమరఁ బండి
యుండుమనసు గ్రొవ్వు ♦ ఖండింపఁగా మోద
మెసఁగు సుజన సంధి ♦ యెడల దెందు.

అని యుత్తరమిచ్చెను.

ప్ర॥ ౧౧. ఆమాటలువినియక్షుఁడార్యా లోకమునకుదిక్కేది? జలము, అన్నము ఎద్దానినుండి లభించు? విషమను నదియేది? శ్రాద్ధముజరపఁదగుసమయ మేది? అని ప్రశ్నించెను. కుంతీసంతత్యగ్రజన్ము డందులకు,

ఉత్త: ఈసర్వమునకు సజ్జనులుదిక్కు. ఆకాశము, భూమియు జలము నన్నము బుట్టించునవి. విప్రద్రవ్యము విషము బ్రాహ్మణాగమనమే శ్రాద్ధమునకు సమయము.

యక్షుఁడంతట నూరకుండక మరల నతనితో

ప్ర: ౧౨. ఏది పరిత్యజించిన మనుజుఁడు సర్వజన ప్రియుండు శోక రహితుఁడు, అర్థవంతుఁడు సుఖియునగును?

అనిన భీమాగ్రజుఁడు.

ఉత్త: తే. సర్వజనసమ్మతుండగు ♦ గర్వముడిగి
క్రోధమడఁచి శోకమునకుఁ ♦ గుదురుగాఁడు
విన వెయర్థాఢ్యుఁడగు లోభ ♦ మొనర విడిచి
తృష్ణవర్జించి సౌఖ్యంబు ♦ తెరువుగాంచు.

అనుటయు నాయక్షుం డానందంబు వెల్లివిరియఁగా నాకుంతీ పుత్రావతంసునితో నయ్యా!

ప్ర॥ ౧౩. పురుషశబ్దవాచ్యుం డెట్టివాఁడు? సర్వధనియగువా డెవ్వఁడు? నిశ్చయింపుమా యని ప్రశ్నింప నాధర్మ నందనుండు,

ఉత్త: క. దివిముట్టి ధరణియంతట
నివిడి మెఱయుచుండు నెవ్వని యశోరమయ
ట్టి విశిష్ట చరిత్రుఁడు య
క్షవరా! పురుషుండునాఁ బ్ర ♦ కాశత నొందున్.

ఆ. ప్రియము నప్రియంబుఁ ♦ బెల్లగు సౌఖ్య దుః
ఖములు భూత భావి ♦ కార్యములును
నెవ్వనికి సమంబు ♦ లిల సర్వధనియన
బరఁగుఁజువ్వో యట్టి ♦ భవ్యుఁడనఘ.

అని యుత్తరంబిడెను. ఇట్టులుత్తర ప్రపంచమునను త్రి

ష్ణుండైన యీ యమనందనునకుం బ్రసన్నుండై దయాదృష్టి నతనిపైఁ బొలయించుచు, నాయక్షవరుండు మహాత్మా! నాయీప్రశ్నంబులకు నన్నింటికిఁ జక్కని యుత్తరంబు లిచ్చితివి. కావున నీయెడల బ్రసన్నుఁడనైతి. నీతమ్ములం దొక్కని ప్రాణంబు లిచ్చెద. అభ్యర్థింపుమా యని యడిగిన మహాప్రసాదంబని కరములుజోడించి దేవోత్తమా! శ్యామాంగంబున గనుపండువు చేయుచు నారక్తజలజనేత్రంబుల సొంపునింపుచు సాలప్రాంశుఁడైయుండు సులలిత బాహుని నకులుని బ్రదికింపుమా యని ప్రార్థించెను. ఆమాటవిని యక్ష ప్రవరుండు నీతమ్ములలో భీమార్జునులు మహాబలపరాక్రమ సమగ్రులు, నీకుం బ్రియులు నగుదురు గదా! వీరిలో నొక్కనిఁ గోరక నకులుం బ్రతికింపుమని యేలకోరితివని ప్రశ్నించెను. కౌంతేయాగ్రజన్ముఁ డార్యా! మాతండ్రియగు పాండుమహీపాలున కిర్వురు భార్యలు. కుంతీ మాద్రులనువారు. అందు గుంతికి మువ్వురము కొడుకులము. అందు నేబ్రతికియున్నవాఁడ. ఇంక మాద్రి కొడుకులగు నిర్వురలో నొక్కఁడు బ్రతుకవలదా! ఇదియేకదా న్యాయము. ధర్మతనయుఁడు ధర్మమందాదృతి గలవాఁడని యందఱు నన్నుఁ బలుకుచుందురు. అట్టి నేను ధర్మహానికి నోర్వజాల. కాన మహాత్మా! నకులుం బ్రదికింపుమా యని వేఁడెను. ఆ మాట కెంతయు నానందించి యమ్మహాపురుషుఁడు ధర్మనందనా! నీధర్మపరతకు గడుంగడు మెచ్చితి. నీతమ్ముల నందఱను బ్రదికించెద. అను నంతలో భీమార్జున నకుల సహదేవులు నిదురనుండి మేలుకొనినట్లు లేచినఁగాంచి విస్మితుఁడై ధర్మరాజిట్లు పలికెను.

మహానుభావా! నిన్ను నేనొక యక్ష మాత్రునిగా దలంపఁజాలను, నిశ్చయముగా దేవేంద్ర కుబేర పావక పవనులలో నొకఁడవుగా నుందువు. లేక నాతండ్రియగు ధర్మ దేవతవైనఁ గావలయు. నిక్కము వచింపుమా అని వేఁడగా మందస్మితము దోఁచఁ, బుత్రకా! నేను ధర్ముఁడను. సత్య శౌచ దాన తపశ్శమ దాంతి యశః పరిజ్ఞాన యుక్తులు నాస్వరూపములు. ధర్మనిరతుఁడ వగు నిన్నుఁ జూడవచ్చితిని. నిన్నాశ్రయించిన వారుఁగూడ దుర్గతి బొరయరు. కాన నీకిష్టములైన వరముల నొసంగెద. వేఁడుమనుటయు నప్పాండుతనయవర్యుం డత్యానందంబున నమస్కరించి మహానుభావా! మదీయాశ్రమ వాసుఁడగు భూసురపుంగవు నరణి హరిణహృతంబయ్యె. దాన నతనికిం గర్మలోపంబు గలుగకుండ ననుగ్రహింపుమా యనిన ధర్ముండు నవ్వుచుఁ దనయా! నీమనోవృత్తిఁ బరీక్షించుటకై యీహరిణిచే నరణి యపహృతమగునట్లుచేసితి. మృగమెక్కడిది? ఇదిగో నీవడిగిన యరణి అని దానినిచ్చెను. ఇచ్చుచుఁ ధర్మరాజా! పదమూఁడవయేఁడువచ్చుచున్నయది. మీరజ్ఞాతవాసంబు సలుపవలయుఁ గదా! మీరేయూర నేయే రూపంబుల సంచరింపఁగోరుదురో ఆయారూపంబు లలవడు. అట్టి మిమ్మెవ్వ రెఱుంగఁజాలరు. ఇదియె వరంబు. ఇంకనేమికావలయునో యడుగుమనియె. అన నతండపరిమిత ప్రమోదంబున దేవాదిదేవా! నీవు ప్రత్యక్షమై నన్నాదరించుటచే ధన్యుఁడనైతిని. ఇంతకంటెఁగోర్కె యేముండును? ఐన నొక్కటి వాంఛించెద. ఎల్లకాలమునందు నా చిత్తము క్రోధమోహాదులం బొరయక ధర్మమునందే

యాసక్తిగలిగియుండ ననుగ్రహింపుమీ యని ప్రార్థించెను. ఆ దేవుడట్లేయుండుఁగాకని వరమిచ్చి యంతర్హితుండయ్యెను.

కౌంతేయులు మగుడినిజాశ్రమములకు వచ్చిరి. భూసురుల కాయరణి నిచ్చి వారి దీవనలంబొందిరి. అందు సుఖముగా కాలము గడుపుచుండఁగా నాపండ్రెండవ సంవత్సరము కొలఁది దినములు కొఱఁతఁగా బూర్తినొందెను. మునీంద్రులాయా నీతులఁ దెల్పి దేశ కాలానుసారము ప్రవర్తింపవలయునని బోధించి యీ యజ్ఞాతవాస వత్సరము నిర్విఘ్నముగా సాగు ననియు నాశీర్వదించి శ్రీకృష్ణమూర్తి మీ పాలనుండ నే భీతియు గల్గబోదనియు హెచ్చరించి వారి నెట్టకేలకు వీడ్కొని తమతమ యాశ్రమములకు బోయిరి. రెండు మూఁడు దినములకుఁ బండ్రెండవ సంవత్సరముపూర్తికాఁగలదనిలోఁచినపుడు ధర్మరాజాశ్రితులను బిలిచి మాకురాఁగలసంవత్సరముదుర్భర కష్టముల నీఁ జాలునది. కావున మీరాకాల మెందైన గడుప దగును. మానివాస మెచ్చట నని యెవ్వరే నడిగినఁ గామ్యక వనమునఁ జూచితిమి. మఱి యెటకేగిరో యని తెల్పుఁడు. అని కొందఱను ద్రుపదునగరంబున నుండునట్లును సారథులను ద్వారకానగరంబున నుండఁగునట్లును నియమించెను. తమ్ము నాశ్రయించియున్న విప్రప్రవరులకుఁదమ వగలఁ దెలిపివారిని వీడ్కొలిపి మరల నొక్కవత్సరమునకుఁ మమ్మాశీర్వదింపనరుగు దెండని ప్రార్థించెను. వారును వీరిని విడువలేక విడువక కూడి యుండిన ముప్పుఁగలుగునని యాలోచించి యెట్టకేలకు పయనము సాగించిరి. నేఁటితోఁబండ్రెండవ వత్సరముపూర్తియగు నని చెప్పఁదగు దినము వచ్చెను. ఆదినము ధర్మరాజు సోదరు

లను ద్రౌపదినిగూడి యొకచో గూర్చుండెను. పురోహితుం డగుధౌమ్యుఁడు రాఁగలవత్సరమును దలంచి యందువారుండ దగు పద్ధతులఁ జెప్పంబూని యెలుఁగు రాల్పడ నిట్లనియె.

ధర్మనందనా ! నీ వెఱుంగని ధర్మవిశేషములు లేవు. ఐనను నావిధినెఱవేర్చెదను. మీరు సద్వంశమున జన్మించిరి. మీతండ్రి దశదిగంత విస్తారిత కీర్తిధురంధరుఁడయ్యెను. ఆకీర్తి నినుమడింపఁ జేయశక్తి మీయందొక్కొక్కరికిఁ గలదు. మీరును లోకాతీతయశస్సును రాజసూయ మొనరించి సంపాదించితిరి. అంతియకాక శ్రీకృష్ణుని కరుణకుఁ బాత్రులరైరి. ధర్మశృంఖలాబద్ధులై యడవులపాలుకావలసినవారైతిరి. ఆకాల మెట్లో గడచిన దనవచ్చును. నేఁడద్దానికి నంత్యదినము రేపటి నుండిపండ్రెండు నెలలు దుర్భరములైన వనవచ్చును. ఎట్లో గడపవలయును. మీజాడ లెఱుంగ దుష్టాత్ములగు ధార్త రాష్ట్రులెన్నో యుపాయములు పన్నుదురు. ఎందఱినో పంపుదురు. మాయోపాయములఁ బ్రయోగింతురు. అట్టి యిడుమలకు గుఱికాకయుండ మెలఁగవలయును. ఏనగరమున నున్నను మీయాఱుగురు వేఱువేఱనుండ నయితిగాదు. ఎట్లున్నను గుఱుతింప వీలగును. కావున భగవత్సహాయమున నీకాలము మీకు దుస్తరమే యైనను సుఖముగనే గడచుగాక, సర్వవిధముల మీధర్మమేమిమ్ముఁగాపాడసిద్ధముగనున్నది. తత్స్వరూపుఁడగు భగవంతుడు ద్వారకానగరమున నున్నను గంటికి రెప్పవలె మిమ్ము నరయుచునుండును. ఇట్టి మీకు భయ మేల గల్గును ? అయినను బురుష ప్రయత్నమునఁ బ్రమాదములు లేకుండునట్లు వర్తింప వలయుఁగదా ? కావున

మీ రప్రమత్తులరై యుండవలయును. రాజనీతులు మీ రెఱుంగనివి లేవు. కాని నేఁ జెప్పదలంచుకొన్న వానిని దాఁచుట నాకు న్యాయము కాదు కావున దెలిపెదను. రాజులు తమ గృహములవంటి గృహములుం గలవారిని గాంచి యోర్వఁజాలరు తమ వంటి వేషముల ధరించువారిపై నాగ్రహింతురు. ఏవిషయమునను దమకు సములుగా నున్న వారిం జూచి యోర్వరు. ఇది నిజము. రాజస్థానంబుల మెలఁగుట కడుంగడుంగష్టము. అట్టితటి మీరోపిక మెయినోర్చి యుండవలసి యుండును. రాజుతో జూదమాడు నప్పుడేని, సరసముగా మాటలాడు సమయముననేని, మిగుల జాగరూకులరై యుండఁజను. ఎప్పుడుగాని యొకరిపనిని దాఁజేయఁబూని యెంత చమత్కృతిం జూపి యప్పని నెరవేర్చినను రాజు నాగ్రహమునకు గుఱిగాక మానఁడు. అట్టికార్యకరణమున నున్న గౌరవమూడిపోవుటేగాదు, క్రొత్త మర్యాద రాఁబోదు. రాజు లేఁకరుణమున నెవ్వనితోఁ గార్యమేది కావలయునో అది నెఱవేఱుదనుక వాని నధికప్రీతితోఁ గారవింతురు. కానియది ముగిసిన వెనుక వానిని నిర్మాల్యములవలెఁ దిలకింతురు. రాజు కరుణను విశ్వాస మునుపరాదు. అది ప్రవాతదీపికవంటిది. దానికన్న విద్యుత్తుస్థిరమనవచ్చును. అనియిట్లనేక ప్రకారంబుల హితములుపదేశించెను.

ఆమాటలకలరి ధర్మనందనుఁడు సోదరులం గనుగొని సోదరులారా! అజ్ఞాతవాస చర్య యెట్టిదో మీ రెఱుంగుదురు కదా! కురుజనపదంబుచుట్టును బాంచాల చేది మత్స్య సాళ్వ విదేహ బాహ్లీక దశార్ణ శూరసేన కళింగ మగధ దేశంబులు

సుభిక్షంబులు జనాకీర్ణంబులు నై యుండు. అందు నివాసంబు చేయుట తగును. నాకుఁజూడ మత్స్యరాజు ధర్మపాలకుఁడు ప్రజానురంజకుఁడు పరాక్రమ సమగ్రుఁడగుట నతని రాజధాని యందుండుట సముచితమని తోఁచెడిని. మీరును దానికీయ కొనినయట్లే చేయుదుము. మఱియు నందుఁ జొచ్చి మనలో నెవ్వరెవ రేయేవృత్తి నూనుదురు? రహస్య రక్షణ మెట్లు చేయుదురు? ఎఱుంగఁ గోరితిననియె. సవ్యసాచి యామాటలు విని సవిషాదంబు సవితర్కంబునుగా నన్నంజూచి యిట్లనియె. ప్రభుత్వమహిమగలిగిమర్యాదయొప్పుచుండగా సౌకుమార్యము సతశీతయు మార్దవము లోనగు వాని పరిపాటి చెలంగుచుండ శాంతి దాంతి త్యాగ భోగాదులు గలిగి మనుజులఁ బాలించుచు నెన్నఁడే నొరులఁ గొలువ నేరకయున్న నీవెట్లువిరటుని గొల్చి తిరుగుదువో తెల్పుమాయని ప్రశ్నించెను. ధర్మనందనుడతని సంశయమ్ములఁ బాపనెంచినగుమోముతో నర్జునా, నేను సన్న్యాసివేషమున రాజును దర్శించి సభ్యత్వమున మాన్యుడనై పుణ్యకథలను జెప్పుచుఁ గొలిచి యతని మన్ననలఁ బడసెద. శ్రౌతస్మార్తాది విద్యల చాతుర్యమును గనఁబఱచియతనికి మహానందమును గల్గింతును. నాపేరు కంకుఁడని చెప్పుదును. జూదమాడుచు రాజునకెంతో యుల్లాసమును గల్గింతును. నీపూర్వచరిత్ర మేమని యడిగిన ధర్మనందను చెలిమి గలిగి యందుండుదునని పలుకుదును. అనిపలికి యర్జునునివిషాదంబపనయించి భీమసేనుం జూచి దగ్గుత్తికచే మాటరామి నెట్లో సవరించుకొని ధర్మరాజు సోదరులు విన నిట్లు పలికెను.

ఈ భీమసేనుఁడు సౌగంధిక హరణార్థ మరిగి యక్షుల యుక్కడాపి ద్రౌపదికి హితముఁగూర్పఁ బుష్పముల గొని వచ్చెను. కిమ్మీరుఁడను దానవుని వధియించి యందున్న వారల కష్టములను దీర్చెను. బకుఁడను దైత్యుని బొలియించి యేకచక్రపురమునకుఁగల వగలఁ దీర్చెను. ఇట్టి వెన్నియో కార్యములు చేసెను. ఇట్టి యీతఁడెట్లు క్రొత్తవాని నాశ్రయించి బ్రతుకఁగలఁడో యని చింతించెను. భీముం డన్న యమ్మలికంబును వారింపఁబూని నేను వంటలవాఁడనై రాజు కొలువు సంపాదించుకొని యందఱ మదికెక్క వంటలుచేసి జీవింతును. వలలుండను పేరున వ్యవహారమును జరుపుదును. మఱియు ననేక ప్రకారంబుల రాజు మన్ననఁ బడయుదు. పూర్వచరిత మేమని భూపాలుఁడడిగిన ధర్మజునకు బానసంబు చేయువాఁడ నసియెదనని చెప్పిన నతండు సంతసించి యర్జునుం జూచి దేవలోకగమన నివాతకవచ కాలకేయాదివధ ప్రముఖ నిఖిల శూరకృత్యంబులం బొగడి యీతఁడెట్లు లోక చిన్న రాజు సేవింపఁ గలడోకో యని విచారమును దెలిపెను. ఆ మాటలవిని సంక్రందననందనుఁడు ధైర్యమూని యూర్వశి నన్ను శపించిన శాపఫలంబనుభవించుసమయమీసంవత్సరమే కావున బేడితనంబు దాల్చి కన్యాజనమునకు నృత్తగీతముల నభ్యసింపఁజేయుచు బృహన్నల యను పేరుధరించి రాజాశ్రయణము సంపాదించుకొనియెద. నా పూర్వవృత్తి నడిగిన ద్రౌపదికడ నుండుదాన నని పలికెద. అనుట యానోఁగాక యని యమతనయుఁడు నకులుం గాంచి విషాదమున నీ నకులుఁడు శరీరసౌందర్యము లోనగువానిచేత మహాపురుషుఁడని

తప్పక చెప్పఁజాలును. ఇట్టి యీ తఁడెట్లుపరులఁగొల్చి జీవించు వాఁడో తోఁచకున్నదని విషాదమునఁ బలుక నకులుండు లేచి, అన్నా! అశ్వశిక్షకుఁడనై దామగ్రంధి యను పేరున రాజు కొలువు సంపాదించుకొని యశ్వరక్షణమునఁ బ్రఖ్యాతినొంది మనఁగలవాఁడను. వాగ్వృత్తాంత మేమన్నధర్మనందనుని కడ నశ్వసేనాధ్యక్షుడనై యుందునని చెప్పువాఁడనని తన వినయ మునఁ గల యుత్తలపాటు నాపెను. అవ్వలఁ గౌంతేయాగ్ర జుఁడు సహదేవుం దిలకించి కన్నీరుప్రవహింపగా.

చ అకుటిలుఁడార్యసమ్మతుఁడ♦హంకృతిదూరుఁడు నీతినిర్మలా
త్మకుఁడనవద్యశీలుఁడుస♦ధర్ముఁడుదాంతుఁడుగొంతిముద్దు సే
యుకొడుకు మేను లేఁతదన♦యుల్లము మెత్తనయిట్టి యీతఁడె
ట్లొకొయొరునాశ్రయించు విధి ♦ యోపదె యెవ్వరినెట్లు
చేయఁగన్.

అని వగచెను. అన్న సంతాపమార్పం దలంచి నేను మత్స్యరాజుకడ గోరక్షకుఁడనై తంత్రీపాలుఁడను పేరుపెట్టు కొని గోపరిశీలనమందు మిగులఁ జమత్కృతిం జూపుచు రాజు మన్ననకుఁ బాత్రుఁడనయ్యెద. తొలిప్రవృత్తి యేమన్న నేను ధర్మరాజుదగ్గర గోశిక్షకుఁడుగా నుంటినందునని చెప్పి యూరకుండెను. యుధిష్ఠిరుఁ డామాటల కూఱడిల్లి సకలకష్టముల పాల్సేయునది స్త్రీ జాతియని యెఱుంగుఁగావున ద్రౌపదిం బరికించి జాలిందూలి.

చ. ఇది కడుముద్దరాలు పను♦లేమియుఁజేయఁగనేరదెంతయుఁ
మృదువొకకీడుపాటునకు♦మేకొనఁజాల దుదాత్తచిత్తయెం

టిదిరుగుదానికోర్వవాక • టిందనుఁదానసవరించుచొప్పెఱుం
గదుతగనొండులంగొలువ•గా వెరవెమ్మెయిఁగల్గుఁజక్కఁగన్!

యని నిట్టూర్పు పుచ్చెను. ఆతని యుమ్మలికంబుఁ బోఁగొట్ట నెంచి సన్నని యెలుంగున రాజేంద్రా! సైరంధ్రీ వేషమున నంతఃపురమునకేగి యామె నన్ను బ్రార్థించునట్లు చేసికొని సైరంధ్రీజాతి యలవాటులను దాటక పరిచర్య చేసి, జీవింతును. నీవెవ్వరియొద్ద నుంటివని యడిగినఁ బాంచాలికడఁ ననుచారిణినై యుంటినని పలుకుదునని చెప్పెను.

## —• పాండవులు విరాట నగరంబు చేరుట • —

ఆవల ధర్మరాజు ధౌమ్యాదులం బంచి వారుండఁదగు తావులం దెల్పి పునర్దర్శనం బయ్యెడుమని ప్రార్థించుచు వారాశీర్వదింప ముదమందుచు వారెట్టకేలకుఁ దమ్ము వీడు కొని పోవఁ జింతిల్లుచుఁ బోయిపోయి విరాటుని నగరంబు చక్కటికిం బోయి యందుఁ గూరుచుండి, తమ శస్త్రాస్త్రంబు లెల్ల నొక్కచో నుంపఁదలంచి యా చేరువనున్న శ్మశానంబు నకు బ్రక్కనున్న శమీవృక్ష రాజంబుఁ దిలకించి దానియందు నునుచుట మేలని యూహించి శవాకృతిగా వానినెల్లం గట్టించెను. పిదపఁ దానె శమీవృక్షంబు నెక్కి ఆ మోపును గట్టి భక్తిచేఁ గరంబులు జోడించి త్రిమూర్తులకు నమస్కరించి దిక్పాలకుల నభ్యర్థించి శస్త్రాస్త్ర దేవతలవేఁడి నరునకు, నాకుం దక్క నొరులకు రూపు చూపవలదని ప్రార్థించి వృక్షంబు దిగి భీమునకుఁ గర్జంబుం దెలిపి యనునయించి యా చేరువ నున్న గోపాలకుల కావిషయముఁను వేఱువిధముగాఁ దెలియఁ

జేయుట సముచితమని యాలోచించి తమ్ములం గూడి యిట్టు లనియెను.

చ. ఇదిశతవృద్ధయూజనవి ♦ యిప్పుడుమృత్యువుఁ బొందెనిట్లుచే
యుమనుముసల్ల ప్రయుక్తమగు ♦ చున్నసనాతనధర్మమిత్తెఱం
గదహనకర్మమెల్ల మది ♦ గానిదిగామునుసిశ్చయించుమా
మొదలిటివారొనర్చువిధ♦ముంగొనియాకృతి మేమునీయెడన్.

అని వారు నమ్మునట్లు పలికి యాచేరువఁ బడియున్న పశుశవంబుఁ గని దాని చర్మంబొలిపించి ఆముడియను రక్షకంబుగాఁ గట్టించెను. పిదప విరాటపురాభిముఖులై పోయిపోయి యజ్ఞాతవాస కాలంబునఁ దమ రహస్య వ్యవహారంబు కనువుగా జయ జయంత విజయ జయత్సేన జయద్బలనామంబులు వరుసగా నైదుగురుకుండునట్లు సంకేతించుకొని యాజ్ఞసేనీ పురస్సరంబుగాఁ బుణ్యతీర్థంబున స్నానంబుచేసి కాలకృత్యంబుల దీర్చి యొక్కచోఁగూర్చుండిరి. అంత గుంతీపుత్రాగ్రజుండు ప్రాఙ్ముఖుండై నిర్మలచిత్తంబున ధర్మదేవతందలంచి

ఆ. తండ్రినీవునాకు ♦ దయతోడనిచ్చిన
వరముచిత్తగించి ♦ వలయు తెఱఁగు
సమయ సముచితముగ ♦ సమకట్టవయ్య యీ
రాకుమారుల విధిఁ ♦ జోకయుండ.

అని ప్రార్థించుచుఁ గరముమనంకి మాట వెడలమి నెట్టో గొంతెత్తి,

ఉ. అంబరవర్తివైనఁగని ♦ యక్షునిచే నగపడ్డ వీరి ప్రా
ణంబులు మున్ను నిన్నడిగి♦ నల్వురకుఁ నయవిక్రమప్రభా

వంబులుఁ వేఁకొన్నసతి • వత్సలభావముఁ బొందియాదరా
ర్ద్రింబగుచూడ్కితోఁ బ్రియహిత • తస్థిరభాషలనూఱడింపవే

అని యప్పటిమాటలు వినిపించినవాఁడై నిలిచినంతనే యతనికి సన్యాసరూపం బలవడియె. తదుచిత సాధనంబు లప్పుడొప్పియుండెను. ఆతక్కినవారలకుంగూడ వారూహించి నట్లువేషంబు లలవడియెను. వారెల్లఁ బరమానంద మొందిరి. ఒక్కరొక్కరుగా నగర ప్రవేశంబుచేయ నియమంబు ముందే చేసికొన్నవారు గావున మొదల ధర్మతనయుఁడు విరాటు నాస్థానమండపంబునకుం బోయెను. రాజుసగౌరవముగామాట లాడి వృత్తాంతమడిగిన నతని మదికరఁగునట్లు మాటలాడి నత్సరవ్రత మొకటికలదు. అంతవఱకిటనుండవచ్చితినన రాజు సమ్మతించి మర్యాదచేసియుద్యోగమిచ్చెను. ఆవలఁబాచకుని వేషముట్టిపడ భీముఁడు వచ్చెను. వచ్చిజయశబ్దపూర్వకముగా రాజునకు మ్రొక్కి నాపేరు వలలుఁడందురు. పాకవిద్యయందు నేర్పుగలవు. అన్నవస్త్రము లిచ్చినఁ జాలును. ఇందుండుదు ననియెను. రాజందుల కానందించి యతని ఇష్టమురీతిఁ గొలు విచ్చెను: మఱికొంత సేపటికిఁ బేడితనము కన్పడ నర్జునుఁడు వచ్చి తన విద్యావైశద్యము సూచింగించి కన్యకాజనమునకుఁ నృత్తగీతముల నేర్పవియమించిన నుందునన గా రాజేంద్రుఁ డంగీకరించి యుత్తరయనునొప్పు కొమార్తెను రావించి బృహ న్నలంజూపి నీకీ మగువ యాట నేర్పును. నీకంగీకారమాయని యడిగిన యంగీకారమును మృదుభాషణంబులఁ దెలుపునామె నీబృహన్నల కప్పగించి విద్యనేర్ప నియోగించెను. అంతట

విరాటుఁడు ఘోటకంబులఁబరీక్షించుచుండ నకులుఁడరుదెంచి యశ్వవిద్యయందుఁ దనకుఁగల పాండిత్యమును దెల్పితన పేరును బూర్వచరిత్రమును నెఱింగించి యతని మన్ననంబడసి అశ్వ శిక్షకుం గుదిరెను. మఱికొంత సేపటికి సహదేవుఁడు గోశిక్షకై వలయు పరికరముల ధరించి రాజునుదర్శించిగోపాలకత్వమున దనకలవడిన పాండిత్యం జెప్పి పేరును బూర్వవృత్తమును నెఱుక పఱచి యుద్యోగమడిగి రాజసమ్మతిం బడసి యాయుద్యోగ మునుస్వీకరించెను. ఇట్లుపంచపాండవులును రాజానుగ్రహము నకుఁ బాత్రులై నిలిచిరి. వారిం జూచిన వారెల్ల వీరియం దొక్కొక్కరు భూమండలము నంతటి నేలంజాలువారయ్యు నిక్కొలువుకు వచ్చిరని చింతించిరి. భగవదనుగ్రహమున వీరు పాండవులై యుందురను యూహ యొక్కరికిందోపదయ్యెను. అంతట ద్రౌపది సైరంధ్రీవేష ముట్టిపడునట్లులు ధర్మదేవతా వరప్రసాదమున నలవడఁగాఁ దదుచితగతి విలాసమున నగర మున బ్రవేశించెను. అత్తఱి నాపాంచాలిని జూచిన వారెల్ల నీమె శాపవశముననో మరి యేకారణముచేతనో భూలోకము నకు వచ్చిన రోహిణియో అరుంధతియో కావలయును. మనుష్యజాతియందిట్టి కాంతారత్న ముదయించునే అని తల పోయుచుండిరి. కొందఱందు నామె దగ్గరకుంబోయి,అమ్మా! నీవేపనికై వచ్చితివనియు నీ వెవ్వతె వనియుఁ బ్రశ్నించిరి. ఆమెయు నేను సైరంధ్రీ జాతికింజేరినదానను. కూడుగుడ్డయు నిచ్చినవారింట నుందును. మర్యాదగా నన్నుఁ జూచువారింట నుండ నేనంగీకరింతునని పలుకుచు రాజమందిరము చెంతకుం బోయెను. ఆసమయమున విరాటు దేవి సుధేష్ణ సౌధాగ్రమున

జెలికత్తియలు గొలువనుండెను. గాన ద్రౌపదింగని యామె యత్యద్భుత రూపమున కచ్చెరువంది యామెం దోడ్కొని రమ్మనిచెడియల నంపెను. వారు రాజమహిషి యాశయ మెఱింగింపఁగా నందులకంగీకరించి,

సీ. పదతలంబుల కెంపు ♦ పరఁగినతలము కుం
కుమలి ప్తమైన చం ♦ దము వహింప
నంగంబునునుఁగాంతి ♦ యడరినగోడలు
వేదులు మణిమయ ♦ విధమునొందఁ
గనుఁగవమెఱుఁగులు ♦ గదిరినముందఱఁ
బుష్పోపహారంబు ♦ పొలుపుతాల్ప
వేనలికప్పు ప ♦ ర్వినమీఁది నీలదు
కూలంబు మేల్కట్టు ♦ కొమరువడయఁ

తే. దానుజొచ్చిన కతన మ ♦ త్స్యక్షితీశు
నింట నెమ్మెయిఁ గ్రొత్తయై ♦ ప్పెసక మెసఁగ
నమ్మహాదేవి యున్నెడ ♦ కల్లనల్ల
పాండురాజ తనూభవ ♦ పత్ని యరిగె.

ఆమె రాకంగాంచి సుధేష్ణయు నతి గౌరవంబు గనఁ బఱచుచు మాటలాడి కులగోత్రాదుల నడిగి యామెకోర్కి యిది యని గుఱుతించి యద్దాని కంగీకరించెను. ఆపాంచాలియు రాజపత్నితో సమ్మామాలినియను నేను నొక్కకారణంబున నుద్ధతులగు విరోధులచేతం బతులయెదుటఁ దలపట్టి యీడ్వంబడితి. నాపతులైదుగురు గంధర్వులు. పదంపడివనంబున కరిగి నియమంబున వన్యఫలాదులతోఁ గాలమును

గడపుచుండ బ్రహ్మచర్యంబు నడపితిని. ఇంకమీఁద నీయాచరణంబునకు నొక్కసంవత్సరంబే కొఱంతగనున్నది. నీవు ధర్మవర్తిని వని విని నా నేర్పుపనులవెంట నీకడ నిలువం దలంచి వచ్చితిని. అనుడు సుధేష్ణ కరము సంతసిల్లి యమ్మా! నీవమర్త్యభేదములలో నొక్కజాతి సుందరివి. ఇట్టి నీ విచటికిరా కారణంబేమి? సత్యమువచింపు. వినవేడుకయ్యెడు అని పలికిన ద్రౌపది సుస్మితమోష్ఠసీమన్నృత్యముసలుపఁ దల్లీ! నేను శ్రీకృష్ణునిదేవియగు సత్యభామకడఁ బనిచేయుచుంటిని. పిదపఁ బాంచాలికడ నుంటిని. పరిచారికా ధర్మములను న్యాయరీతిఁ బ్రవర్తించుచుంటిని. ఆ పాంచాలి నాప్రాణములకుఁ బ్రాణమై గారవించెను. అట్లే నీవు కూడ నీచములగు పనులకు నన్ను బనుపక మర్యాదగా సైరంధ్రీ జనుల యాచారముల నెఱింగి పనులఁగొనుదే నుండెద. లేకున్న నొండుకడ కేగెద. సువాసనలఁ గల్పించి గంధముదీయ, సకల విధములఁ బుష్పముల గైసేయ జడ వేయనేర్తు. అనిన నా రాజమహిషి యందులకు సమ్మతించుచు నమ్మా! యొక్కమాటను జెప్పెద. ఆగ్రహింపకుము. నిన్ను నాచెంత నునుచుకొనుట నాకుఁ బరమ సమ్మతమే. కాని నీయద్భుత రూపమునుగాంచిప నించుక సందియమొందుచున్న దానను. అన నామె భావమెఱింగి పాంచాలి యిట్లుపలికెను. దేవీ! యట్లుసందియము చెందవలదు. నీచమతి నన్నెవ్వడు చూచినను నా పతులేవురు వాని నారాత్రి వధింతురు. కంటికి రెప్పవలె నన్నువారు కాచుచుందురు. నన్నవమతిఁ బొందఁజేయు వా రెట్టివారైన నాపతులు వధింతురు. అట్టిదుష్టుల నాపతులు చంపకుండఁ గాపాడఁ ద్రిమూర్తులైన

వలంతురు కారని సమ్మతము. అట్లు కావున నన్నుంచేటిచూడ బురుషులు వెఱతురు. కాఁబట్టి దేవీ!

చ. మనము నను అశ్లీలమన ♦ హాసము మానమున నన్న నేలు మే
పను లను సదా త్తనాగరిక ♦ భంగులు నీమది కెక్కనట్లు నే
ర్పును భయభక్తులున్ మెఱయ ♦ రూపుగఁ జేసెదఁ దజ్ఞులైన స
జ్జనులు నుతింపవర్తనము ♦ సాక్షులు వృద్ధులు మెచ్చు జల్పెదన్.

నాపతు లేవురును నాకు నీచపుఁబనులు చెప్పక మర్యాదగాఁ జూచువారికి మహోపకారము చేయఁ జాలుదురు. నావిని యా దేవి యామెయునికి కంగీకరించెను. మాట దప్పక మర్యాదమెయిఁ బనలఁ గొనుచుండెను. సైరంధ్రియుఁ దదను రూప ప్రవర్తనమునఁ గాలము బుచ్చుచుండెను.

## —♦ పాండవులు విరాటునగరమునఁ గాలముపుచ్చు విధము ♦—

కొంతకాలము పాండవులు తమ రే పరాక్రమాందఁ జూపు వెరవులేక యెట్లో కాలమును గడిపిరి. ధర్మనందనుడాయాయి సమయముల కనుకూలించునట్లు ధర్మోపదేశము చేయుచుఁ, గథలు జెప్పుచు, జూదమాడుచు, నెల్లవారల మన్ననలం బడయుచు విశేషించి రాజు మన్ననకుం బాత్రుఁడయ్యెను. భీమసేనుఁడు రాజసభ కరుదెంచిన మల్లురతో యుద్ధముచేయుచు వారి నొక్కపెట్టున బడఁగొట్టుచుఁ బ్రఖ్యాతి వడసి రాజు నాదృతికిం బాత్రుడయ్యెను. బృహన్నల రాజపుత్రికకు మాత్రము గాక యామెతో నాడుకొను కన్యల కెల్ల గీతము, నృత్యము నేర్పుచు మరియాద నొందుచుండెను.

నకుల సహదేవులు తముచిత ప్రవర్తనముల రాజ మరియాదల నొందఁజాలిరి. ఇట్లుకొలఁది నెలలు గడచెను. ఈ యేవ్వరు లేకున్న నీనగరమే పాడగునని యెల్లవారును దలంచుచుండిరి. ఎవ్వరికేని వీరివలన నొక్కకీడును గలుగకుండెను. విశేషించి ధర్మరాజు నీతిమహిమంబున నందఱును కంకుభట్టువు చెప్పిన దే వేద వాక్య మనుకొనుచు నా మహనీయుని విడిచియుండు కాలము తుచ్ఛమనుకొనుచుఁ బనిలేని సమయముల నెల్ల నాతనికడం జేరి ధర్మవిశేషముల నెఱుంగుచు నాకాలమే శుభసమయ మని యూహించుచు నుండిరి. విరాటుండును గంకునితో సరసముగా మాటలాడుచుఁ దదుక్తధర్మపద్ధతుల నాలకించి పరమానందభరితుఁ డగుచు, నాయాకాలములకు నుచితములగు ద్యూతక్రీడాదులఁ గాలము పుచ్చుచు నతని యందు దయగలవాఁడై మర్యాదమీఱ వర్తించుచుండెను.

## కీచకుని భీముఁడు పొలియించుట

పాండవుల కిట్లు సుఖముగాఁ గాలము గడుచుచుండఁ జాలనెలలు గడచెను. కొలఁదిమాసములుండఁగా నొకనాఁడు విరాటుని బావమఱఁదియగు కీచకుఁడు తోఁబుట్టువగుసుధేష్ణ యింటికింబోయి యామెతో మాటలాడుచుండి యాచెంత మెలఁగు సైరంధ్రిం గాంచి యారూప మావఱకెన్నఁడు విని నదియుఁగనినదియుఁగానియట్లప్రతిమానముగానుండ దిగ్భ్రమ చెంది యామెవృత్తాంతమును సుధేష్ణనడిగియామె కార్యాంతర ప్రసక్తిని గాలము పుచ్చఁగాఁ నింటికింబోవుచు సైరంధ్రితో నేమో మాటలాడఁబోయి యాతరుణీమణి యొసగిన ప్రత్యు

త్రరముల కలికియింటికిం బోయి మరల సుధేష్ణయింటికి రాక నాఁడు వచ్చి యామె వృత్తాంతమును జెప్పవలయునని పట్టు పట్టెను. ఆమెయు నతని దుర్వృత్తి నెఱిఁగియు విధిలేక యామె వృత్తాంతమును దెలిపెను. ద్రౌపది మొదట నామెతో గంధర్వులైదుగురు తన భర్తలనియుఁ దన్నెవ్వరేని నీచముగా భావించినచో నారేయి వానిని జంపుదురనియు దెలిపియే యుండెనుగదా! ఆపలుకుల నా సుధేష్ణ మఱువక సోదరునితోఁ దగినట్లు మాటలాడి యామె నీచస్త్రీయనియు నామెను గోర రాదనియు మందలించెను. వాఁడు కామవశంగతమానసుఁడై తన హృదయాభిలాషము నెఱింగించి యెట్టులైన నామెను దన వశముచేయుమని ప్రార్థించి యది పొసఁగకున్నదాఁ జీవించుటయే కష్టమని తెలియఁ బలికిపోయెను. సుధేష్ణయుఁ జేయునది లేక సోదరుఁడు మృతుఁడగునన్న పరితాపము ద్రౌపది మున్ను దెలిపిన పలుకులు తన్నుఁ గలతపెట్టగాఁ గానున్నది. కాక మానదని తలపోసి సైరంధ్రిం గాంచి యొకనాఁటి సాయంకాల మమ్మా! నా సోదరు నింటికిం బోయి సురఁగొని రమ్మని బ్రతిమాలెను. విధిలేక పానపాత్రము గొనిపోవుచు భగవంతుని సూర్యునిం బ్రార్థించెను. సూర్యుఁడదృశ్య రూపమున నామెను రక్షింప నొక్క భీకర రాక్షసుని బనుప వాఁడదృశ్యాకారంబున నంబరంబున నుండెను.

సైరంధ్రి కీచకు నిల్లుసొచ్చి సుధేష్ణ పనుపెఱింగించి సురనిమ్మని యడిగి వాఁడు తమి వెల్లిదంబున మాటలాడుచు, బ్రతిమాలుచుఁ, జేతఁజేరి పట్టుకొనఁబోవ సూర్యప్రేరితదనుజ

బలము తనయందంతకుముందే సంక్రమించి యుండుటం జేసి యాతనిచేయి విడిల్చి రథసంబునఁ దన్మందిరము వెలువడి పోవుచుండ నాతఁడు వెంటఁబడి కొప్పుపట్టి యీడ్చెను. అంతలో సూర్యప్రేరిత దానవుఁడా కీచకుని ద్రోల్లవేసెను. ఆమెయుఁ దప్పించుకొని విరాటుని కొలువునకుఁ బోయెను. కీచకుఁడు వెన్నాడుట కన్నులారఁ గాంచిన భీమసేనున కాగ్రహము హృదయమున నిమ్ముడక పొంగెను. దానిచే నొడలు తెలియక చెంతనున్న మహోన్నత వృక్షంబుంగనుంగొని ధర్మనందనుం జూడ నాతండునయనంబులవారించి స్వాభిప్రాయ గర్భంబుగాఁ దన యాగ్రహంబుడుగునట్లు మాటలాడఁ బ్రయత్నమును మాని యూరకుండెను. సైరంధ్రియు గొలువుకూటము సొచ్చి తన పతులఁ దూఱుచు నా యన్యాయ వృత్తాంతము నెఱింగించెను. విరాటుఁడు కటకటంబడియుఁ గీచకునిదండించుశక్తిలేమి సాంత్వనోక్తులంబలికి యామె కోపమాపెను. ధర్మజుం డాగ్రహము నొందియు దానినడంచుకొని యథాపూర్వకంఠధ్వనితో



సీ. జననాయకుండు నీ ♦ సభవారు నీదగు
తెఱఁగెల్ల నెఱిఁగిరి ♦ తెఱవయింక
మానక యీపలు ♦ మాటలాడఁగనేల
చనువు నీవు సుధేష్ణ ♦ సదనమునకు
నీపరాభవమున ♦ గోపింపనేర లే
గంధర్వులకుఁ దఱి ♦ గాదుగాక
సమయ మెయ్యెదియేని ♦ తమకును నీకును
మునుగల్గినట్లయినఁ ♦ గినియరిచటఁ

తే. గాననాథుల దూఱంగఁ ♦ గాదు విభుఁడు
సతికిఁ దానెంతవఁడియును ♦ సభలలోనఁ
దక్షవృగానిల్చి యిట్టులు ♦ దుగ్రవృత్తి
శంకచెడి ధిక్కరింపఁగఁ ♦ జనునె చెప్పుమ.

అనుచు నామె యింకను మహత్తర క్రోధంబుననేమో పలుకఁ బూనుటెఱింగి నాట్యముచేయుచాడ్పున నిటఁబలుకఁ దగదనెను. ఆమాటల యందలి భావ మెఱింగియు సైరంధ్రి గంభీర స్వనంబున సాభిప్రాయంబుగా,

ఆ. వె. నాదవల్లభుండు ♦ నటుఁడింత సిక్కంబు
పెద్దవారియట్ల ♦ పిన్నవారు
గాన ప్రబతుల విధమష్టిక ♦ యే శైలూషిఁ
గానసంగరాదు ♦ కంకభట్ట.

ఇంతియగాక జూదరియాలికిఁ గలువతనం బెక్కడిదని యాచోటు విడిచిపోయెను. ఆ పరాభవమామె కించుకంతయు నూఱటఁ గల్గింపదయ్యెను. కాన నారాత్రి భీమసేనునకుం జెప్పుకొనందలఁచి మహానసగృహంబునకుం బోయి భీమునకెల్ల వార్తల నెఱింగించి యాతని పనుపున నింటికింబోయెను. మఱునాఁటిరాత్రి సంకేతప్రకారము భీమసేనుఁడు సైరంధ్రింగూడిపోయి కీచకుని వధియించి తత్సోదరుల నిరవశేషంబుగా వధించెను. ఆవార్త విన్నవారెల్ల సైరంధ్రి భర్తలు గంధర్వులు గీచకుం బొలియించిరని తలంచిరి. కీచకమరణవార్త యెల్లతావుల వ్యాపించెను.

## —♦దుర్యోధనాదులు పాండవుల వెదుక యత్నించుట♦—

పాండవుల వృత్తాంతమిట్టులుండ నట దుర్యోధనుని వృత్తాంతముఁ దెలిసికొనుట యొప్పుగదా! అజ్ఞాతవాస నియమ సమయమునఁ జాలభాగము చెల్లగా నంతకుముందే దుర్యోధనుఁడుపంపిన చారులెల్ల దేశముల వెదకి మరలివచ్చి దుర్యోధనున కా వృత్తాంతమును దెలుపుచు విరాటునగరంబున విరాటుని బావమఱఁదియగు కీచకుని నొకవనిత కతమున నర్ధరాత్రమున గంధర్వులు రహస్యప్రకారమున వధించిరఁట. ఇదే యాశ్చర్యమగు వృత్తాంతమనియు విన్నవించిరి. దుర్యోధనుండంతఁ గొలువునఁగలవారి నెల్లనడిగెను. ఎవరికిఁదోచినట్లు వారు విన్నవించిరి. దుశ్శాసనాదులు పాండవులు చచ్చి యుందురనిరి. భీష్మద్రోణులు పాండవులదుస్థితికిం జింతిల్లియుఁ జేయునది లేమి నూరకుండిరి. పాండవుల గుణగణముల బొగడిరి. నాఁటియాసభలో విరాటనగరంబున మాఱురూపములఁ బాండవులుందురనియు గంధర్వ పంచకమన వారేయై యుందురనియు వారింపగనుఁగొనుట కరుగవలయుననియు, నా ప్రయాణము విరాటగోధనమును దక్షిణోత్తరభాగముల నున్న దానిని బట్టుకొనిన విరాటునింగూడి పాండవులు తప్పక వత్తురనియు నపుడు వారిని గుఱితింపవచ్చుననియుఁ దీర్మానింపబడియెను. మఱియు సుశర్మ విరాటునకు విరోధిగాన నతఁడు దక్షిణగోగ్రహము చేయఁ బోవునట్లును, దక్కంగలవారెల్లనుత్తర గోగ్రహణము పొంచెనరుగవలయుననియు నిర్ధారితమయ్యెను. ఆకార్యమునకుందగు సన్నాహము లొనర్పబడియెను.

## —◆ సుశర్మ దక్షిణగోగ్రహణంబు చేయుట. ◆—

సుశర్మ పూర్వవైరంబుంబాటించి చతురంగబలంబు లంగూడి మత్స్యనగరంబునకు దక్షిణంబుననున్న గోధనముకు ముట్టడించెను. గోపాలకులు కొంతవఱకు యుద్ధముచేసిరి. వారి ధాకకుఁ దాళజాలక పోయిరి. హతశేషులు నగరంబునకుం బోయి నిండుకొలువుండు విరాటభూజానితో మహారాజా! త్రిగర్తదేశాధిపతి చతురంగ బలంబులంగూడివచ్చి మనగోధనమునాక్రమింప మేమువారిందాఁకిపోరితిమి. అపారమగుబలము వారిదిగాన హతశేషులమై మేము వచ్చితిమి. వారిపుడే గోధనమును దోలుకొని దానివెంబడిపోవుచున్నారు. దూరముపోవకుండనే యది పట్టుకొనవలయు. తరువాత దేవరయే ప్రమాణమని మనవిచేసిరి. పిడుగువంటి యావార్తకు విరాటుఁడదరిపడి ఏమేమీ! నాగోధనము త్రిగర్తపతి యాక్రమించెనా? ముందునాశక్తి యెఱింగినవాఁడే యయ్యు మరల వచ్చినవాఁడు కాఁబోలును! అనిబలంబులఁ బయనఁబుచేయింపుడని దండనాథుల కాజ్ఞయిడి, తానును రథంబెక్కి పురబహిర్భాగంబున నించుక నిలువఁగా ధర్మనందనుఁడు భీమనకుల సహదేవుల నాయత్తపడి రండని నియోగించి తాను ముందుగాఁ బోయి విరాటుని గాంచి మెల్లన నిట్లనియె: మహారాజా!

చ. ఒకఋషిచేతనాయుధ స◆ముత్కరమెల్లనుసప్రయోగము
త్రకముగనభ్యసించిసమ◆రంబునకుం గొఱమైనవాఁడ గో
ప్రకరముఁ గ్రమ్మరల్చుటకు◆బాధులు నీవు పోవనాకునిం
టికడనయున్కి పాడియెను◆టింపఁగఁబంపురథంబుచయ్యనన్.

అని వేడగా నాతండంగీకరించెను. ధర్మజుండు మరల నా రాజుతో మన వలలుండు బలమునం బౌరుషమున నసదృశుండు. దామగ్రంధి తంత్రీపాలురు నట్టివారే. నేను గొంత యెఱుంగుదును. కాన వారల దోడుకొనిపోవుట కర్జంబని తోంచెడిని, మీకు నిదిసమ్మతమేని వారిరాక కంగీకారమిండు అని తెలుప నీయకొని శతానీకుండను దమ్ముని రప్పించి వీరి నల్వురకు మంచి రథంబుల నమరింప బంపుము. వీరును సమరమునకు వత్తురని నాతండట్లు చేయ నందఱును వెడలిరి.

అతిజవంబున విరాటసైనికులు సుశర్మసైనికుల నెదిరి మార్కొనిరి. ఒండొరులకు ఘోరరణంబు చెల్లెను. ఇరుదెసల వారును భూదేవికిం గొందరు బలియైరి. వారివెంట రథికులు తలంపడి పోరాడసాగిరి. విరాటుండు సుశర్మమీందికి రథము తోలించి మార్కొని పోరాడెను. వారొండొరుల మించు పౌరుషంబుల వియచ్చరులగ్గింపం బోరాడుచుండిరి. పాండవులును విరాటుండింత మేటిమగండేయని యభినుతించుచుండిరి. ఇంతలో సుశర్మ యుద్ధతిమెయి విరాటుని నిశాత శరజాలములం జిక్కుపఱచి త్వరపడి యతని రథంబుపైకి లంఘించి యుంచుకి సోలియున్న యాతనింబట్టుకొని తన రథంబునకుం దెప్పించి ధ్వజస్తంభమునకుంగట్టించి తనపయనము సాగించెను. ధర్మనందనుం డాతనిపాటు భీమునకుం జూపి సోదరా! ఇతని యాశ్రయమున నిన్నిదినములు బ్రదికితిమి. ఇపు డితనికి సాయ మొనరించుట న్యాయము. నీవు త్వరపడి వెనుకొని యాతని విడిపింపుమని యొత్తిచెప్పిన భీమసేనుండు ధర్మనందనా!

యిదె పాల మహీజం బిదుఁ గలదు. దీని శరాతిబలంబులఁ జెండి త్రిగర్తు నోడించి విరాటుని విడిపించెద, చూడుమని అన్నను దమ్ములను పిలిచి తానొక్కరుండ చనఁబూనెను. ధర్మపుత్రుం డాతని వారించి తరువు పెఱికికొని నీవు సమరంబు చేయ వృకోదరుండగుట తెల్లమగు. ఆ విధము మాని కవలు చక్రరక్షకులుగా నడిచి సమరంబుచేయు మన నా పలుకులు తన యుత్సాహాధరంబును గురియింప నందుల కంగీకరించి యరదమెక్కి త్రిగర్తనాథుని మార్కొని క్షణమాత్రమున నతని యిరుప్రక్కల నున్నవారి నేడునూఱుమంది రథికుల రూపుమాపెను. నకులుఁడును సహదేవుఁడును యుధిష్ఠిరుండు ననేకులఁ బొలియించిరి భీముఁడు సుశర్మమార్కొని శరవృష్టిఁ గురియించుచుండ ధర్మరాజు వాని యశ్వములఁ గూల్చెను. అంతలో విరాటుఁడెట్లోకట్లు విడిపించుకొని యతని రథంబుపై నున్న గదాదండ మెత్తుకొని సుశర్మను మోఁదెను. భీముం డత్తఱి సుశర్మ యరదంబు పైకి లంఘించి యతనిం బట్టుకొని పెడకేల్గట్టి భయంకరముగా నార్చెను. ఆ నాదము సింహ నాదమును మించ నందఱు భీతిల్లిరి. హతశేషులగు సైనికులు బరువెత్తగా గోధనంబును మరలించి విరాటునకుఁ బాండవులు పొడసూపఁగా నారాజు మహాదరంబున యుధిష్ఠిరుం జూచి,

క. మానముఁ బ్రాణముఁ గాచితి
దీనికి సరిగాఁగ నీకు ♦ డికిఁ బ్రియ మొసఁగం
గా నాకుఁ జేయనయ్యెడు
దానినెఱుఁగఁ గాన మత్ప ♦ దముఁ గైకొనవే.

అని మఱియుఁ బెక్కు విధంబులఁ బ్రార్థింప నయ్యజాత శత్రుండు మహారాజా! నీవయయే చాలుఁను. మనము జయ లక్ష్మిం గూడి నగర ప్రవేశంబు చేయుటయే నాకానందము. అన మరియు విరాటుండుకోరికందెల్పు మిచ్చెదనని బలవంత పెట్టనట్లేనని సరథగజాశ్వంబుగ నీత్రిగర్త పతిని బంధముక్తునిం జేయుమిదియె నావాంఛితంబననాతండట్లుచేసెను. ఆరాత్రివారె ల్లనందొక్క సైకతస్థలంబున విడిసియుండిరి. జయఘోషము నగరమునఁ జాటించిరి. మఱునాఁడు నగరమును బ్రవేశింప వారాలోచించి యచ్చట సుఖనిద్ర చేసిరి.

—♦ ఉత్తర గోగ్రహణము – బృహన్నలవిజయము ♦—

సుశర్మను బంపిన వెనుక దుర్యోధనుఁడు చతురంగ బలంబులంగూడి విరాటుపురంబునకు నుత్తర భాగంబునంగల గోధనంబుఁబట్టుకొననడచెను. మేటిమగలెల్ల యుద్ధోన్ముఖులై నడచిరి. సూర్యోదయకాలమపుడు గోగణంబున్న తావును వారెల్లరుఁ జేరిగి. గోధనము నాక్రమించిరి. గోపాలకులుతమ కప్పుడు గల పరికరములతో మారొకనఁ గృపాశ్వత్థామాది యోధులవ్వారి క్రొవ్వడంచిరి. ఇది కౌరవసైన్యమనియెఱింగి గోపాలకాధిపతి యాక్రోశించుచు నగరనకుంబోయి రాజ మందిర ద్వారము చొచ్చి రథంబుదిగి యంతఃపురంబున నాట పాటలం గాలమును బుచ్చు విరాటతనయు భూమింజయుని గాంచి ససంభ్రమముగా రాజకుమారకా! భూచక్రమల్లాడునట్లు కౌరవ బలంబు లరుదెంచి మన గోగణంబుల ముట్టడించెను. తోలుకొనిపోవఁ బూనియుండ నేనరుదెంచితిని. త్వరపడి

వారలం బారంద్రోలి గోవుల మరలింపఁ గడంగుము. త్వరగా రథముఁ దెప్పింపుము.పరికరములఁగొనిబయులు వెడలవలయును అని పెక్కు విధముల నుత్సాహము గలుగఁబలికెను. ఆసమయమున నాతని చుట్టును గాంతాజనముండెను. వారినడుమ దన్నిట్లు వినుతింపఁగా నట్టె పొంగి గర్వోద్ధతిచే మనమున సంగరక్రీడ యుప్పొంగ నాగోపాలక విభుఁగాంచి,

ఉ. ఎత్తెలఁ గొందుఁగౌరవుల♦ నెల్లనుమార్కొనిశేని గోవులం
దెత్తుమహా ర్తమాత్రమునఁ ♦ దేరికిసారథి లేమిఁజేసి నా
చిత్తమునన్ విచారదశ ♦ చెందెనునెవ్వఁడుకల్గునొక్కొనా
కిత్తఱినేఁ గదా గడప ♦ నెంతయు నేర్తురథంబనంబురిన్.

నాకిత్తరుణమునఁ దగుసారథి దొరకిన యెడలఁబగతుర నదలించుటన నదెంతపని? గోవుల దూరముగాఁ దోలుకొని పోవుదురేమో. మనపురమున సూతునరయుము. ఈసమయమున భీష్మద్రోణాదివీరశిఖామణులుండు కురురాజసైన్యంబును మార్కొని చీకాకు పరచిన పసులఁగ్రమ్మరింపకయున్ననన్ను రాజు మెచ్చుకొనునా? నా మిత్రులునన్నుఁగొనియాడుదురా? పరివారము సంతృప్తినొందునా ?

అను నంతలో నాచెంతనప్పాంచాలియుండి యామాట లాలకించి వడివడింబోయి ఇంద్రనందనునితో నా పలుకులు చెప్పెను. ఆతఁడజ్ఞాతవాసనియమమతిక్రమించెనని గణనమున నెఱింగి పాంచాలింజూచి నీ విప్పుడేపోయి వారలతో మన బృహన్నలకు సారథ్యంబుచేయ సామర్థ్యంబుకలదని చెప్పుము. అంతియకాక ఖాండవ దహనంబునఁ బాండవ మధ్యమునకు

సారథియై యతని చిత్తమునకు మెప్పుగలుగఁ బ్రవర్తించె
నను. మఱియుఁ బెక్కుతావులఁ బార్థునకుం దోడ్పడియె. నే
నెఱుంగుదును. అతని సహాయంబునం గురుసైన్యంబుల జయింప
సంశయంబుండదు అని యొత్తిచెప్పెను. ఈమాటలకు వారు
బదులాడక తదనుకూలముగా మాటలాడి నన్నుఁ బిలుచుటకై
పన్నాగం బొనర్చెను. నా విని పాంచాలి యట్లే చేయుమనని
యుత్తరయున్న చక్కటికిం బోయి రాజనందనుఁడు సారథి తగిన
వాఁడు దొరకక వెదకుచున్నవాఁడు. తెలిసిన మాట చెప్పవల
యునుగదా. అర్జునునకు మెప్పుపుట్టించు నేర్పును, బాహుబలము
గలిగి సూతవృత్తి మిగులఁ బ్రఖ్యాతి గాంచినవాఁడు బృహన్నల
ఖాండవదహనకాలమున నర్జునకుం దోడ్పడి విజయంబు సమ
కూర్చెను. ఈవిషయ ముత్తరునకుం దెల్పుదము. అని యామె
నొడంబఱచి యామెయుఁ దానునుబోయి యావృత్తాంతమును
సముచిత ప్రకారంబున నెఱింగించిరి. భూమింజయుండు సైరం
ధ్రింజూచి సైరంధ్రీ! నాతో నిట్లు పలుకుట న్యాయమా? నేను
బేడిని కన్నెత్తియైన జూడను. ఇఁక నాతని సూతకృత్యమున
కెట్లొడంబడుదును. మరొక్కమాట వినుము. వచ్చినది కురు
సైన్యము. గోధనము నపహరించెను. దాని నోడించి గోవుల
మరల్చుటకు నేఁ బోవువాడను. ఇట్టి మహోత్కృష్ట
కార్యమున సారథి బృహన్నలయేయైన నలువురు నవ్వ
కుందురా? మన నగరంబున రథచోదకు లింతకఱవా అను నా
యుత్తరుని మాటలకు బదులాడఁదలంచి సైరంధ్రి మెల్లగా
రాజకుమారా! ఈ కౌరవబలమే కాదు. త్రిజగంబు లొక్క
పెట్టున నీపై నెత్తివచ్చినను బృహన్నల సారథియై నొగలఁ

గూరుచుండ జయించుట సులభము. ఆ వీర శక్తి మున్న నే నెఱుంగుదు. కాదేని జన్మమున శరీరవికారము వచ్చినం బోవుచెనా. నామాటం బాటించి యాతని సారథిగాం గైగొనుము. కార్యాంతమునం దద్వృత్తాంతము నీవే యెఱుంగుదువు.

అని సైరంధ్రి సముచితరీతిం జెప్పుటయు నాతండు సంశయించుచు నప్పటి కొరు లెవ్వరు దొరకమి బృహన్నలం బిలువుమను పల్కపలికెను. అదివిని యాతనియనుజ నేంబోయి తోడ్కొని వచ్చెదనని పనిబూని,

సీ. అడుగులనునుం గాంతి ♦ నయ్యెడం బద్మరా
గంబుల నెలకట్టు ♦ కరణినొప్ప
బాలిండ్లు తనువెడ ♦ గ్రాలింపం జెన్నొందు
లసదు గొందీంగెయ ♦ ల్లాడుచుండం
దఱివేచి వెనువెంటం ♦ దగులు కామాంధకా
రములీల గ్రొవ్వెద ♦ కొమరుమిగులం
గర్ణభూషణమాక్తి ♦ కప్రభాడోలన
మీక్షణ దీప్తుల ♦ నినుమడింప

తే. నందియల మొరపంబున ♦ కరుగుదెంచి
ప్రోదిరాయంచరయమునం ♦ బోవు నవ్వి
ధంబుదగ నభ్యసించు చం ♦ దమునదోప
చనంగ నుత్తర నర్తన ♦ శాల కరిగె.

బృహన్నల చెంతకుంజని యిచ్చట నొక్క సంగరంబున నాయన్నకు సారథియెవ్వండు లేమినీవని కితరుడొప్పం డయ్యెను.

నేఁడు కౌరవులతో యుద్ధంబు చేయఁబోవ నమకట్టి సారథి లేమికి విషాదంబునొందినఁజూడ సైరంధ్రి చెప్పఁ బ్రియంబంది నిన్నుఁ దోడ్కొనిరా నన్నుఁ బంపినవాఁడు. నీవు నా ప్రార్థన మన్యథాకరింపక నీ సామర్థ్యంబును గనఁబఱచి మాయన్న రథము గడపఁబూని యీ యాపదఁ దొలగింపుము. ఒడంబడకున్న నాయందలి వాత్సల్యము తగ్గించినట్లే యని సంభావింతును. అనుటయు నాతండు నవ్వుచు రాజకుమారీ! నాకు సారథ్యంబునఁ బాండితిఁ గలదే? నీమాట మిగిలి వర్తింపనిచ్చగింపను. పోదము పద, నీ ప్రార్థన చేనది యెట్టి దుష్కరకార్యమైనఁ దీర్చెద. నీకు మహోత్సవంబు చేసెద.

అని పలికి యప్పుడే నర్తనశాల వెలువడి యుత్తరుని సన్నిధి కరుగ నా బృహన్నల నించుక దూరముననే చూచి నేఁడు కౌరవులతోడఁ గయ్యంబు కలిగినది. సారథ్యమునకు నీవంగీకరింప వలయును. ఆయుత్తమునఁ ద్వరపడి యరదమెక్కుమని పలికెను. అప్పలుకుల విని రాజకుమారకా! ఆటపాటల యుత్సాహముగలిగిన తఱి ననుఁబిల్వ న్యాయముగునుగాని యుద్ధముచేయ సారథివి కమ్మా యనుట పాడియా యని చమత్కృతిమీఱఁ బలుకఁగా బృహన్నలా యని పిల్చి భూమింజయుండు ఖాండవదహనకాలమున నర్జునునకు సారథివై జయము గల్గించిన నాఁటిబుద్ధి నగపఱచి నారథము నడపుము నాయందు మైత్రి నిబాటింపుము. వేఱొండు మాట చెప్పకుము నా విసిమాఱు పల్కమాని పరికరముల నాయితము జేసి కవచంబు దొడగి రథంబును బూన్ప నుత్తరుం డరదమెక్కి సింహకేత

నముంగాంచి ముదమంది రథము గడుపుమను నంతలో నుత్తరయుఁ జెలులు నాతనిం జూచి కురువీరులఁ గెల్చి వారి యంబరములలోఁ జిత్రవర్ణములు గల వానిని దేవలయును. వానిని బొమ్మపొత్తికలకు నుపయోగింతువము. అవి మాలోచనముల కుత్సవము జేయఁజాలును జుమీ యనిరి! ఆ మాటలకు బృహన్నల యుత్తరము చెప్పఁ బూని భూమింజయుండు జయలక్ష్మి జేకొనునఁట. ఇఁక బొమ్మపొత్తికలకుం గొదువయగునా! ఎల్లభంగులం దెత్తును, అని పలికి వారి సంతుష్టమతులం గాఁ జేసెను. అంతట రథం బెటుపోనీయవలయునని యడుగ గోపాలకుఁడు పితృవనంబు వలనని చెప్పెను. రథగమనమును దెలిసి రాజకుమారుఁ డచ్చెరువొందునట్లు రథము నడుపఁబడుచుండెను. క్షణమాత్రమున నా యరదము పరేతనిలయప్రాంత ప్రదేశంబు చేరెను. ఉత్తరుఁ డంతదూరమునకు దృష్టిసారించి చూడగాఁ గురురాజ సైన్యంబు మహత్తర భయజనకంబుగాఁ గానఁబడెను. ఆధూళి మెల మెల్లన నంతరిక్షమున కెగిరిపోవుచుండ నొక గవానము దివికిఁ గాపురము చేయఁ బోవునట్లుండెను.

దానిం జూచినంతన యుత్తరుని మదిం గల యుత్సాహపౌరుషములింక మాకిచటఁ బనియే లేదని తొలఁగి దూరముగ బోయెను. అవి యుండు తావునఁ బెనుభీతి పాదుకొనియెను. తద్దర్శనమున నోరెండఁ బారెను. పెదవులు కంపింపసాగెను. వీని పాటుగాంచి హృదయగ్రంధి యెగురసాగెను. దాని కిరుప్రక్కల నున్న బాహువులు వ్రేలాడ సాగెను. దానఁ గోదండము క్రిందనుండుట మంచిదనుకొనియెను. వీనియవస్థ

లంగాంచిన మోము, కాంతి సేపికనిగుంతుల మర్యాద కాదని మొటకోపోయెను. పిదప నెట్లోకొంత సేపటికి నన్నింటికి సమాధానము చెప్పి మీకీగండము రాకుండఁజేసెదనని వాగ్దానమిచ్చి మనస్సు వదనమును బ్రోత్సహింపఁ తొందరుపడుచు నుత్తరుడిట్లులా బృహన్నలంజూచి పలికెను.

శా. భీష్మద్రోణకృపాది ధన్వినికరా ♦ భీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్యపటు ప్రతాపవిసరా ♦ కీర్ణంబు శస్త్రాస్త్రజా
లోష్మస్ఫారచతుర్విధోజ్జ్వలబలా ♦ త్యుగ్రంబు దగ్రధ్వజా
ర్చిష్మత్వ్యాకలితంబు సైన్యమిదియోఁ ♦ జేరంగ శక్తుండనే.

బృహన్నలా! అస్త్రవిద్యయందారితేరిన వాఁడను గాను. వయస్సు యుద్ధముచేయునంత వృద్ధినొందలేదు. గుఱి పెట్టికొట్టుట కింకను బ్రయత్నింపలేదు. కౌరవులో సకలాస్త్రవిద్యాపారంగతులు. నిండుజవ్వనమున విర్రవీఁగువారు. గుఱి కాండలో మేటులు. శకుని సైంధవ వికర్ణ కర్ణ ప్రముఖ యోధవీరులను నే నెదుర్కొనఁ జాలుదునా! పురముననుండి నపుడీ విషయ మెఱుఁగను. ఏమోయనుకొని వచ్చితిని. మన స్థితి వారిపద్ధతియు నాలోచింపమనమున భీతిజనించెకీని. మనము మార్కొనునట్టిదీ సైన్యము కాదని తెల్లమగుచున్నది. మీఁద మీఁద భీతివృద్ధియగు చుందముగాన నయ్యెను. బృహన్నలా! కౌరవసేనఁ జూడగనే మనస్సులోఁ దనువు వడవడ వడంకు చున్నది. నాయవస్థల నారయక నీవూరకే రథముత్రోలుకొని

పోవుచుండుట తగునా? ఇప్పటి స్థితినిఁజూడ నేనువీరిని మార్కొనజాల. ఇదినిశ్చయము. కావునఁ దేరు మరల్పుము, ప్రాణములు తీపనుట మున్ను నీవు వినలేదా?

అనుమాటలకు జిఱునవ్వు వ్యాపింపఁగా బృహన్నల యతనింగాంచిరాజకుమారకంఠీరవా! సాటిలేనిపరాక్రమంబున బొదలు యోధాగ్రేసరులపై శరదంబుఁబఱుప నేనంత వెఱ్ఱి వాఁడనా! గోవులవెంటఁ బోవు తుచ్ఛసేనలఁ జించిచెండాడి గోవులమరలింతము. అట్లు చేయక పశువులుపోవుటచూచియు మరలిపోవుట మనకు న్యాయమా! అదియుంగాక అంతఃపురమునంగల యంగనామణులెల్ల సమ్మదంబునఁబొదలునట్లు గోధనమును మరలించుకొనివచ్చెదమని బీరములఁ పల్కి పౌరులు పొగడుచుండ నగరము వెడలివచ్చి యీయుద్ధభూమియందేనుగులను, గుఱ్ఱములను, రథంబులను, వీరభటులను గాంచి కలంగుట మంచిదియా! ఎవ్వరే విన్న నవ్వరా! భీతిల్లక వైరివీరుల మార్కొని కోదండగుణధ్వని వినువకుండ వినఁబడ శరపరంపరలఁ బరఁగించి యరులఁ పరిభవించి గోధనంబుల మరలించి బంటుతనంబునకు జననీజనకుల సంతసింపజేయుము. నావిని యుత్తరుండామాటలకుమఱింతభీతిల్లి తనువు వడంకుచుండఁదడబాటుగనఁబరచు మాటలతో నయ్యా! బశువుల దైవమెఱుంగును. అంతఃపురాంగనాజనంబుల సంతోషము నాకేల? నీవేమన్న ననుము. యుద్ధము నాచేతగాదు.

అను నుత్తరు పలుకులు విని ధనంజయుండు భూమింజయా! లోకమున నెవ్వఁడైన నిజబాహుబలమున శత్రువుల

పరాక్రమము పరీక్షించి తనచేత వారెట్లుకు జావరని స్పష్ట పడినపుడు తొలఁగిపోవుటయో నిలిచి మృతినొందుటయో తీర్మానించుకొనుము. అంతియగాని యుద్ధమునకుముందే నీవలెఁ బాఱిపోవఁ దలంపరు. శూరులీ నీ వార్తవిన్న నేమాత్రము మెచ్చుకొనరు. ఈకురుసేనలు నీపరిక్కైనఁ జూడలేదె! నీవేల యిట్లు భీతిల్లెదవు ? ముందు నీకు భయముగలుగుటకు హేతు వేమోనాకెఱింగింపుము. వినియూహించెద. మఱొక్కమాట చెప్పెద. త్వరఁబడక వినుము. లోకమున రాజపుత్రుఁడెవ్వఁడు గాని యిట్లు మాటలాడినవాఁడు గలఁడా ?

సీ. దెసలు బీటలువాఱ ♦ దివురు చిందంబుల
కోలాహలములకుఁ ♦ గుదియఁబడక
యురవడి సేనలు ♦ దెరలఁబైదోఁ తెంచు
ధూళిపెల్లడరినఁ ♦ దూలిపోక
చతురంగ బలమతి ♦ సాంద్రతఁ గలిసిన
యగ్గలికమునకు ♦ జెగ్గడిలక
శస్త్రాస్త్రములు రథ్య ♦ సారథివర్మాంగ
తతి నాఁటు తఱచునఁ ♦ దల్లడిలక

తే. బహువిధంబులఁ బగతురు ♦ బరవసమున
నిత్తెరంగునఁ గలుగు క్రమం ♦ దెల్లనోర్చి
నిల్చి గెల్చిన సత్కీర్తి ♦ నెగడుఁగాక
దవ్వు దవ్వుల నిట్లయిన ♦ నవ్వరెట్లు.

ఉత్తరకుమారా ! నేజెప్పిన యీమాటలు క్షత్రియ కుమారార్హములా? కావా? నీవే యూహింపుము. అనియంత

నిలువక యేమో చెప్పఁబోవఁగా నా యుత్తరకుమారుఁడు బృహన్నలా! మా తండ్రి సకల సైన్యములఁ దోడ్కొని త్రిగర్తనాథునిపై కరిగెను. నాకు నగరమున సాయము చేయఁదగిన పురుషుఁడొక్కఁడును లేడు. నేనొక్కండన తలఁపడి కురుబలములనోర్చునంతటి వాఁడనా! యివేటిమాటలు? కురుబలములు నావైపునకు దృష్టి మరలించుటకు ముందే తేరుత్రోలుకొని పురికి రుగుటయే మనకు నీతికాని మొండిపట్టుపట్టి వారిమాఱ్కొని బలవన్మరణము రీతి జచ్చుట పాడియగునా? అన విని యింద్రనందనుఁడు భూమీంద్రనందనునితో భయపడి యిట్లు పలుకుట నీకుఁ బాడియా? శత్రువులు హర్షమందగా బంధువులమాటఁదలంపక పౌరులు నవ్వుచుండ నింటికిం బోవుట మర్యాదకాదు. అంతియఁగాదు. నన్ను సైరంధ్రి నీయొద్ద చేరికొనియెఁగదా! దాన నీకు సారథినై యరుదెంచితిని. నీ బంటుతనమును వినుతించి పౌరు లాశీర్వదించిరి. అట్టిచోట నింతవఱకు వచ్చి గోవర్గములఁ గౌరవులు కొనిపోవఁ గాంచుచు గ్రమ్మఱ నగరమునకు నేఁబోవువాడనే! నీకేటికీ భయము? రాకుమారా! ఇంచుక మనోవ్యాపారమును నిర్బంధింపుము. ఇదె కురుసేనలు చూచి వడవడ వడంకులాఘన దారుణసంగర మొనరించి గోవర్గమును యథాస్థానమున నిలిపి పోవుదము. అని మాటలాడుచు రథము గడపుచుండెను.

ఆమాటలు విని రథము పోనిచ్చుటంగని యుత్తరుఁడు మోము వెలవెలఁబాఱ మానసమదరుచుండఁగా బృహన్నలా! ఏమిట్లు మాటలాడుచునే యరదమును గడపుచున్నవాడవు? దూరము నుండియే తొలఁగిపోయిన బాఁపులు నవ్వుమరా? నవ్వనిమ్ము.

నన్నెదిర్బోధింపకుము. నీకునంతటి గర్వముగలదేని నీవుపోయి తలపడుము. నీవెట్లుపోయిననా కేమి? అనుచు నుత్తరోత్తరాభివృద్ధియగుచున్న భీతిచే శరశరాసనముల నారథమునందే వదలి సత్వరముగా భూమికి లంఘించి సిగ్గువదలి నగరము దెసఁ బాఱెను. ధనంజయుం డాతని యప్పటి చేష్టలకు నేవగించుచు నొగలపయిఁ బగ్గంబులనునిచి స్యందనము డిగ్గనుఱికి కేశకలాపము వీడ రక్తాంబరము గాలిచేఁ గదలుచుండ నాతని వెనుకం బరుగిడెను.

అత్తఱి నాతని రూపముంగాంచి కురుబలంబులఁ గొందఱు హాస్యముచేసిరి. కొందఱతని వికృత దేహమును జూచుచునేయుండిరి. అందుఁగొందఱు ప్రాజ్ఞులుమూర్తి సౌమ్యత్వము, బాహువుల దీర్ఘత్వము, గత్తి సొంపును గాంచి సంశయము గదుర నారీత్వ పురుషత్వములు రెండును నగపడుచున్న యవి. చూడంజూడ నితఁడు నివురుగప్పిన నిప్పువోలిక నున్నవాఁడు. చక్కఁగానాలోచింప బాహువులచాయయు, గమనవైఖరియు నితఁ డర్జునుఁడేయని చెప్పక చెప్పుచున్నవి. సంశయము లేదు. తనతేజముఁ దాచుకొని విరాటు నగరంబునఁ బేడియనఁ గప్పియుండనోపు. కానున్న నీ కురుబలముల మాఱ్కొన నింకొకఁడు రాఁజాలునా! సుశర్మ తోడి యుద్ధమునకు విరటుఁడు తనబలముల దీసికొనిపోఁగా నగరమున నొక్కరుఁడు లేమి నుత్తరుఁడిట వచ్చుచుండి సారథి వేఱొకఁడు లేకపోవుటం జేసి యాతనిఁ దోడుకొని వచ్చి యుండనోపు. గోపకులు పరుగిడి గోగణముఁ బట్టిరనఁగా

నాలకించి చిన్నవాఁడుగాన మీఁదరయక యహంకారమున
వచ్చి యీ మహత్తర సైన్యసన్నాహమును గాంచి భయంపడి
పరుగెత్తెను. ఈవీరునిసత్త్వము కొలఁది నెఱుంగఁడు. అనియిట్లు
సంశయాకుల మానసులై యుండఁబూహించుచుండిరి.

అట నర్జునుం డాతని శతపదమిత దేశంబున నుత్తరుం
జేరి పట్టుకొనియెను. ఉత్తరుఁడును బెదవుల తడి యాఱఁగా
నవయవములెల్ల స్వేదమయంబులుఁ గాఁగా బాదములు హస్త
ములు వడఁకుచుండ హృదయ మదరుచుండఁగా దీనదృష్టుల
విజయుంగనుంగొని బృహన్నలా! సువర్ణ టంకములునూఱి
చ్చెద. పరిశుద్ధ వైడూర్యము లెనిమిది సమర్పించెదను. ఆజా
నేయంబులఁ బూన్చినస్యందన మొసంగెద. పదియేనుఁగులనర్పిం
చెదను. ఒక్క యూరునిత్తు. ఇవన్నియు నగరముచేరిన యుత్తర
క్షణమున నీకిత్తును. నాయందలి ప్రీతిచే నాతురవై రణరంగ
మునుండి యరుగుదెంచి నాసుతుఁడెప్పుడు కనఁబడునాయని
యెదురుచూచు నాతల్లికి సంతోషమును గల్గింపఁబోయి
యామెనుజూతు. నన్నుఁబోనిమ్మాయనిమఱియుఁబెక్కు తెఱం
గులఁ బ్రార్థించెను. విజయుండాతని నెట్లో యరదముచెంతకుం
దోడితెచ్చి రాజకుమారకా! వెఱవకుము. కురువీరులతో నని
జేయఁజాలవేని మానుము. రథమునకు సారథివగుము. పిడుగు
పైఁబడినట్లడరి వీరిని జించిచెండాడెద. వీరభటులు పాఱిపోవం
జేసెద. రారాజు ధీరత్వము నశింపఁజేసెద. గోవులమరల్చెదను.
అనిధైర్యముచెప్పియు నాతడంగీకరింపకున్నను నెట్లోయుత్తరుని
నొగలఁగూరుచుండఁబెట్టి తాను రథికుఁడై శమీవృక్షము
చెంతకుఁబోయెను.

## —♦ కురుసేనలయం దుత్పాతములు తోఁచుట ♦—

ఇట్లు సవ్యసాచి శమీవృక్షంబు చేరుఁడు గురుబలంబుల కెన్నియో దుర్నిమిత్తములు తోఁచెను. సూర్యబింబము మలిన మయ్యెను. నక్కలు కురుసేనల కభిముఖముగాఁ గూసెను. వికారముగా మేఘ మంబరమున నావరించి గర్జించెను. తూర్యము లపజయమును దెలుపునట్లు మ్రోసెను. ఆయపశకునములం గనుంగొని ద్రోణాచార్యుం డిట్లనియె: వీరులారా! యుద్ధ మగుట సత్యము. సేనల వ్యూహములరీతి నిలుపుడు. మీమీ యాయుధముల సిద్ధపఱచుకొనుఁడు. వాహనముల సన్నద్ధము లయియుండ నొనరింపుఁడు. శక్తి కనుగుణముగాఁ బశువులఁ గాపాడుఁడు. అని వారల హెచ్చరించి శిష్యవాత్సల్యంబు గల వాఁడు గావున నజ్ఞాతవాస సమయ భంగమగునో యన్నసంశ యంబున గాంగేయు నాలోకించి శాంతనవా! వెరవరిగాక ఈ తఁడు కురుసేనలకుం గనుపడువాఁడా? ఒక్రమాని పేర(అర్జునము మద్దిచెట్టు) నిటవచ్చుచున్నవాఁడు. అహంకారమే కాని వేఱొ కటియెఱుఁగఁడు. ఈతనిమూర్తి విశేషముగాంచినచో సురపతి వలెనొప్పుచున్నయది వీని భావమూహింపఁజాలకున్నవాఁడను. ఆద్రోణుని మాటలు విని యాపగానందనుఁడు తత్సంశయ మును మాన్పదలంచి చెంతనున్న దుర్యోధనుం జూచి యత నితో మాటలాడినట్లును, దాన నాచార్యు సంశయము పాయు నట్లును యోజించి యిట్లనియె:

రాజకుమారకా! శత్రువులకుఁ దగిన తావునతిక్రమించి వచ్చితిమి. అఖండిత బాహుదర్పమును బ్రకటింపచేయు సమ

యమువచ్చెను. ఇఁక శత్రువుల వలనఁ జలింపఁబనిలేదు. అనిన
నామాటల యర్థమూహించి కలశజుండర్జునునకు సమయభంగ
భయంబు లేదని యెఱింగి మనంబత్యంత సంతోషమును జెం
దఁగా నాభావము ముఖమునం గాననీయక సంశయ బువదలి

శా. సింగంబాకటితో గుహాంతరమునఁ • జేడ్పాటుమైనుండి మా
తంగస్ఫూర్జితయూథదర్శనసముద్య • త్క్రోధమై వచ్చునో
జంగాంతారనివాసఖిన్నమతిన • స్మత్సేనపైఁబడెవ
చ్చెంగుంతీసుతమధ్యముండుసమర • స్థేమాభిరామాకృతిన్,

అని పలుకుచు నిపుడీతనితోడి సంగరమునకుం జాలిన వాఁడు మనలోనుండుట సంశయమే. గోవుల మరలించుట యాతని కెల్లభంగుల సుకరంబు. వీఁడీశ్వరుని సంతుష్టుంజేసెనని విందుముకదా. కావున వీనినిపుడు మార్కొనుట సులభమగు పనికాదనెను. ఆపలుకులువిని రాధేయుండు కటకటంబడి ద్రోణాచార్యా! పాండవపక్షపాతమున నీవిట్లనుచున్నవాఁడవు. ఇంతటి సేనలోనొక్కఁడయిన విజయు మార్కొనఁ జాలువాఁడు లేకుండునా! లేఁడని చెప్పుట న్యాయమా! ధనురాచార్యా! నిశ్చయముగా నర్జునుఁడంతటివాఁడా? ఇప్పుడొనర్చుచున్నవాఁడర్జునుడేయైనచో శరపరంపరలుపరగించి వెగడుపరచి యోధవీరులఁ కెల్ల మహోత్సవమును జేకూర్చెద.

అనికర్ణుండుపలుకదుర్యోధనుండిట్లుపలికెను. రాధేయా! నీవన్నమాట యంత సమ్మతమైనదికాదు. ఇత డర్జునుఁడేయైన మరలసోదరులను గూడి యడవులకరిగి యం దేపదిమూఁడుసంవత్సరములుండవలయును. మఱియొక్కరుండే యైన నాధను

ద్వివిర్గతనిశాతశరముల కాహారమేయగు. అనుటయు నమ్మాటలకు గాంగేయ కుంభసంభవులు కృపాశ్వత్థామలు మనంబుల గుత్సించుచు నాతఁడు వినునట్లు మేలుమేలని యంగీకరించిరి.

వీరిట్లుసంవాదములఁ బ్రొద్దుపుచ్చుచుండఁగా నచ్చటనర్జునుండు శమీవృక్షంబుచేరువ నరదంబు నిలుపంబంచి యుత్తరుంగాంచి రాజకుమారా! ఇన్నగమునందుగాండీవకోదండవరమున్నయది. అది దొరికినఁగాని నా భుజాటోపమును జూపవీలులేదు. తక్కిన చాపములు నా బాహువిస్ఫారణమునోర్వఁజాలవు. మనరథమున నున్న యీచాపములు నీబాహుబలమునకుఁదగినవి. పలుదెఱంగులఁ జూపదగు నాయాటోపమునకుం జాలవు. గాండీవమో, వీనికంటె వేయిమడుంగు లెక్కుడు శక్తిగలది. కావున నట్టిది చేతనుండినఁగాని యరాతుల నుఱుమాడుటకు సాధ్యముకాదు. కాఁబట్టి యిమ్మహీరుహం బెక్కి యమ్మహనీయ చాపంబుఁ దెచ్చి యిమ్ము. ధర్మజ భీమార్జున నకుల సహదేవులు తమతమ సమస్తాయుధంబులను కూడంగట్టి యీ వృక్షంబునఁ బెట్టినవారు. కావున నా కట్టువిడిచి యందు గాండీవమును మాత్రము గ్రహించి తక్కినవాని నెప్పటియట్ల బంధింపుము. అనిశవాకారంబుననున్న శస్త్రముల కట్టునుజూపెను. ఉత్తరుండద్దానింగాంచి బృహన్నలా! శవము నంటఁదగునా! రాజపుత్త్రుఁడని యైనఁ దలంపక సంశయింపక నన్నీ నీచకార్యమునకుం బూన్చుట నీకుఁ దగునాయని ప్రశ్నించెను. ధనంజయుండాతని సంశయమువాపగోరి యత్యాదరంబున రాజకుమారా! మనుజులు స్పృశింపకుండ మఱుగుపడఁ జేసిన శస్త్రాస్త్రసంచయంబె కాని శవముకాదు. అట్టిదైన నప్పని నీకుం జెప్పెదునా

నా మాట నమ్ముము శమీవృక్షము నెక్కుము. ముడివిచ్చి చాపము నాకందింపుము. అనుటయు నాతఁడు చేయునదినేరక యెట్టకేల కావృక్షము నెక్కెను. అర్జునుం డరదంబున నిలుచుండి, వేవేగ విడువుము. శత్రువులు దూరము చనకముందే మన మరుగవలయు. కాన నాచాపము నాకందింపుముఅనిత్వర పెట్టుచుండ నుత్తరుం డద్దాని ముడివిప్పెను. అందున్న యాయుధకాంతు లాకస్మికముగ గ్రమ్మఁగాఁ దత్కాంతుల భరింపఁజాలక యుత్తరుని దృష్టులు విభ్రాంతినొందెను. అట్టి తఱి నయ్యాయుధములు క్రూరసర్పములవలె భయంకరములై విషము లుమియుచున్నట్లగపడఁగా భయంబంది యుత్తరుని దేహము కంపింపసాగెను. అర్జునుం డదియెఱింగి తగుమాటల ధైర్యము చెప్పుచుండెను. భూమింజయుండెట్లో ధైర్యమును దెచ్చుకొని యాకట్టుపిడచి విస్మయంబున సారథియని యర్జును బిలిచి, యోహో! ఇందొక చాపము కనుపట్టెను. కొండ చిలువయో యనందగియున్నది. దీని పేరేమి ? ఇది పాండవు లలో నెవ్వరిచాపమో తెల్పినసంతసింతుననియెను. అర్జునుఁడు రాజకుమారకా! తొలుదొలుఁత నీవు కని నన్నడిగిన యా దొడ్డ విల్లర్జునునిదసియెఱుంగుము. అని తెలిపి, తక్కినచాపములవర్ణించి యవియెవ్వరెవ్వరివో తెలియంజెప్పెను. అంతియఁగాక తక్కిం గల సాధనములఁగూర్చి వివరించెను.

—♦ అర్జునుఁ డుత్తరునకుఁ దమవృత్తాంతమును దెల్పుట ♦—

ఆ యాయుధముల వృత్తాంతముల వినియు నర్జును నెఱుంగఁజాలక మూఢుఁడుగాన నాతనిం జూచి బృహన్నలా

యని సంబోధించి యీవృక్షంబున నీ మహనీయాయుధముల నునిచి పాండవు లెచ్చటి కరిగిరి ? నీ వెఱింగినంత నా కెఱింగింపుము. నే నప్పాండవుల మేనల్లుఁడను. వారలు సజ్జనమిత్రులు శత్రుపౌరుష ధ్వంసకులు. లోకహిత కార్యారంభులు. అని వారిం బొగడుచు స్నేహగౌరవ విషాదంబులు తెలుపునట్లు పలుకుల దుఃఖించెను. ఆతని విషాద మపనయింపఁ దలంచి భూమింజయా ! పాండవు లెందున్నారో యని విచారింప వలదు. విధి వశంబున వచ్చిన యాపదలకోర్చి ప్రతిజ్ఞా పాలనంబున బద్ధాదరులై పాంచాలింగూడి పండ్రెండు వత్సరంబు లరణ్యవాసంబున గడపి పదమూఁడవదగు నేఁడజ్ఞాతవాసంబున బుచ్చవలయునన్న నియమంబుఁ బాటించి మన నగరంబున నేకుందునొందక యున్నవారు. వారెవ్వరెవ్వరన్న సంశయము పోవ నెఱింగించెద,

క. కంకుఁడు ధర్మసుతుఁడు వల
లాంకుఁడు భీముండు కవలు ♦ హయశిక్షక గో
కింకరులు చెప్ప దొడఁగితి
నింకఁ గొఱఁత పెట్టనేల ♦ యే నర్జునుఁడన్.

తే. అధిపనందన మాలిని ♦ యనఁగబరఁగు
కాంత ద్రౌపది దానికై ♦ కాదె సింహ
బలుని దమ్ముల గంధర్వ ♦ పతులు చంపి
రనఁగ జంపె మహోగ్రత ♦ ననిలసుతుఁడు.

అను మాటల కానందసాగరమున నోలలాడుచు భూమింజయుండు చిరునవ్వు మోమునఁ దోఁప నార్యా ! అర్జునునకు

బది పేరులుగలవు. వానిం దెల్పిన నిన్నునమ్మెద. అనుటయు నర్జునుండు నవ్వుచు నర్జునుండని, ఫల్గునుండని, పార్థుండని, కిరీటియని, శ్వేతవాహనుండని, భీభత్సుండని, విజయుండని, జిష్ణుండని, సవ్యసాచియని, ధనంజయుండని పేరులు పదియు నాకుం గలవు. అన నుత్తరుం డవ్వియేకారణంబునఁ గలిగెను. ఆవిధము తెలిసియున్న వచింపుము. అనుటయు నట్లే చెప్పెద వినుమని యర్జునుం డిట్లనియె :

భూమండలమెల్ల గెలిచిరాజులనుండి ధనముగొన్నందున ధనంజయుండనుపేరు నాకుంగలిగెను. ఎట్టివారినైన మార్కొన్నచో జయంబుగొనుట కతన విజయుండనుపేరు ప్రఖ్యాతంబయ్యెను. తెలుపురఁగుల వాహనములే నారథమునకుండినందున, శ్వేతవాహనాఖ్య ప్రసిద్ధంబయ్యె. ఇంద్రదత్తమైసూర్యప్రభా భాసమానంబయి యభేద్యమునగు కిరీటము నాకునుండుటఁగిరీటియనునామధేయము విబుధసమ్మతంబయ్యెను. సంగరరంగమున జొచ్చితడంబడకభీభత్సంబు చేయుదుగాన భీభత్సుండనునాహ్వాయము ప్రథితంబయ్యెను. ఖండనమున రెండుచేతులను గాండీవము దివిచి యేయఁగలశక్తి నాకుఁగల్గుట కారణమున సవ్యసాచియని నన్నందరు పిలుతురు. లోకమున నెవ్వారికేనిదుర్లభంబగు శ్వేతవర్ణము నాదేహమునఁ గల్గుటంబట్టి యర్జునుడని నన్నందురు. ఉత్తర ఫల్గునీయను నక్షత్రమునఁ బుట్టుటఫల్గునుడను నభిధానము గల్గెను. యుద్ధమున మార్కొని ధర్మరాజు దేహమున గాయము నేను జూచుచుండ నింద్రాదులుంగూడ

జేయఁజాలరుగాన జిష్ణు నామము విస్తరిల్లెను. పృథయను పేరు నా తల్లికింగలదు. తత్పుత్రకుండనగాన బార్థనామధేయము ప్రసిద్ధంబయ్యెను. భూమింజయా! వ్యర్థముగాఁ బల్కెదనా? నేను ధర్మరాజు ననుజుఁడనుగదా? ఈయీ కారణంబుల నీపది నామములు నాకుంగలిగినవి. ఖాండవదహన కాలంబున శ్రీకృష్ణ సహాయుఁడనై దేవతలడ్డుపడినను నిలువకయ కార్యంబు సాధించితింగాన బ్రహ్మయు, శంకరుండును విజయుంచేసి వారియెడ నేఁ జూపిన వినయగౌరవములకఁరికృష్ణుఁడను పమనొకండవ పేరు నాకొసంగిరి. అప్రతిహతశరంబునొసంగిరి. అని తానొనరించిన వీరకృత్యంబులను దద్విశ్వాసార్థ మెఱిఁగించిన విని యుత్తరుండు సాష్టాంగ నమస్కారంబు లొనరించి చేతులు మోడ్చి మహాత్మా! నీదర్శనమున నాయదృష్టదేవత ప్రసన్నమైనట్లు భావించెదను. నాసమ్మోహము పోయినది. మనస్సు నిర్మలమైనది. నీవర్జునుఁడవని యెఱుంగక నేనేమేమన్ననువానిమఱచి దయామతివై నన్నుఁ బ్రోవదగును. అనుటయు నర్జునుండు రథము దిగ్గ్రిందనిలుచుండి చేతులు మోడ్చియున్న భూమింజయుని బిట్టు కౌఁగిలించుకొనెను. ఉత్తరుండు తదాలింగన సమాశ్వాసిత చిత్తుఁడై కలంకఁదేఱి రిపుగణమర్దనా! విజయా! ఇఁక దేరెక్కుము. నీబాహువుల ప్రాపున సారథిత్వమున నాశక్తిఁ గనబఱచెదను. ననుఁబనిఁగొమ్ము. లెమ్ము. మనగోవుల మరల్పుము. కురునాథుని గదల్పుము. చిరకాలమునుండి యర్జునునకు సారథ్యము చేయ గోరుచుందును. అది నేటికి ఫలించినది. నావిని సంతోషమున విజయుఁడుత్తరకుమారకా! నీయందు నాకెక్కుడు ప్రీతికలదు. సారథివగు నిన్ను గుఱ్ఱములను నరదమును బరులగాలియు

లేటిచూడఁజాలఁ వని నమ్మెదము. కావున నింక నరదముగడవు ముసుఁటయు నాతండానందపరవశుఁడై నొగలెక్కి ధనంజయా! నాయందుననురాగమున మాటలాడితివిగాన నొక్కటి వినఁ గోరెద. నీకేలయీరూపములవడియె? ఇఁయేనా ప్రార్థనమనఁగా నాతండతనికి నూర్వశీశాపము నెఱింగించి సకలసంశయముల బాపి దివ్యాయుధంబు లాతఁడుగదంబుపై నునుపంగాంచి రథం బెక్కి యింద్రదత్తములగు కవచకుండ లోష్ణీషంబులధరించి దేవదత్తంబుందలంపనది సన్నిహితంబగుటయు దానినాదృతిం గొని యొత్తిన నా ధ్వని మహాభయంకర రీతిందనరెను దానఁ గురుబలంబుల పౌరుషములడంగెను. ఉత్తరుండు విస్మితుండై అది యేమని యడిగెను. అర్జునుండు దేవదత్తమహిమమును దెల్పియాతని భీతి మాన్పెను.

అత్తఱి ధనురాచార్యుండు దుర్యోధనుని జూచి నారి శ్రోతశ్రవణరంధ్రములఁబద్దలుజేసెను. శంఖరవము హృత్కండముల మూఁచివైచెను. పతాకమార్తిని గల్గించెను. కిరీటికాంతి దృష్టుల భ్రమింపఁజేసెను. ఇదియర్జునుసిగాఁడీవదేవదత్తకపిధ్వజ శతమఖదత్తకిరీటములుగాని వేఱుకావు. అచ్చెరువునుగల్గించుచు దనపరాక్రమంబు నెఱపదగుతఱి యిదియనివివ్వోత్సుఁడేవచ్చెడిని. వివాదము చేసినఁ దప్పునది గాదు. కావున మేటిపౌరుషముఁ జూపఁగల వీరులఁబోరికిమలర్పుము. అని పలికి కృపాశ్వత్థామల నవలోకించి మనబలములలో ననేకదుర్నిమిత్తములు పొడకట్టు చున్నవి. వీనిచే జయంబనుమానమని తోఁచెడిని. నేనొక హితముపదేశించెద. ఆలకింపుఁడు. ముందు రారాజు పోవునట్లు చేయుఁడు. గోవులను రాజువెంట రక్షకులతోఁ బోవునట్లొన

ర్పుఁడు. మేటి మగలెల్ల వాని వెనుక నిలువుఁడు. మొనలుగ దీర్చియుంచుఁడు. ఇంద్రసూనుఁడు రాఁగా నేమార్కొనఁజాలునట్టి ప్రియత్నమున నుండుఁడు అనుటయు దుర్యోధనుండు ద్రోణాచార్య ప్రభృతులు వినంగ వనవాస నియమకాలము నిర్ణయింప భీష్మ ద్రోణులు సమర్థులు. సంగరంబున జంకనేల యని పౌరుషములాడిన విని యశ్వత్థామ రాజుతో,

ఉ. కావలివారిదోలి మొన ♦ కంబున గోవులఁ బట్టుకొంటి నం
చీవెడమాటలేల ధర ♦ ణీశ్వర యింతకు మున్న వీటికిం
బోవవు శత్రునేపుడిపి ♦ పోయెడువాఁడవుగావు నీవు సై
న్యావళిమైనఁ జేష్పడక ♦ యాతలకెయ్దుట లేదు నేనివియును.

క. సమరమున గెల్చి యొరురా
జ్యముగొనియును సుజనుఁ డిట్టు ♦ లాడఁడు సిరి జూ
దమునఁ గొని రజ్జులేటికి
సమయం బరుదెంచెఁ దొంటి ♦ చందముగలదే!

ఉ. పాండవవీరులం గలన ♦ బాహుబలంబున నోర్చి యేసము
ద్దండతనీవు తొల్లి ద్రుప ♦ దక్షితిజాత్మజఁ గొల్వులోనికిం
దెండనిపుచ్చి తద్దైనకుఁ ♦ దెచ్చుట సౌబలు నీతిఁగాదె యా
తండు మరల్పఁగాక సమ ♦ దగ్రతవచ్చు విరోధినిప్పుడున్.

రాజా! ద్రోణాచార్యు నాక్షేపింపవచ్చుంగాని విరోధి మారణంబున సాటిలేని పరాక్రమంబుం జూపు నర్జును మరల్ప వచ్చునే! సజ్జను నెవ్వరేనియుఁ బొగడవలయు. పుత్రనిర్విశేషుండగు శిష్యునగ్గించుట ద్రోణాచార్యునకుం దప్పగునే. ఇంక సిగ్గుమాలి రణంబు చేసిన ద్రోణుండే చేయుఁగాక నేనట్టి పనికిం బూనను. కాలాంతకుఁడును బడబానలము దార్కొని నిరవ

